# ఉత్తమ స్త్రీలు

(మొదటి భాగము)

బుక్కపట్టణము - రామానుజయ్య

# విజ్ఞాపనము

శ్రీ మహాలక్ష్మియంశమున భువి నవతరించిన శ్రీరుక్మిణీ దేవిపరమపవిత్రచరిత్ర మగునీయాంధ్రవచనప్రబంధమును సహజపాండిత్యబిరుదాంకితపోతనామాత్యకవిచూడామణిప్రణీతం బైనభాగవతములోని శ్రీరుక్మిణీకల్యాణము ననుసరించి నానేర్పుకొలందిని మార్పుకూర్పులతో నీటు గులుకు తేటతెలుఁగున వ్రాసినాఁడ. మఱియును మహాభారతమునుండి సావిత్రీచరిత్రమును దపతీచరిత్రమును గైకొని గద్యరూపమున సులభశైలిని వ్రాసినాఁడ. ముందు నిట్టియుత్తమస్త్రీలచారిత్రములను మఱికొన్నిటిని బాలురకు బాలికలకు సుబోధక మగు రీతిని వ్రాసి ప్రచురింపఁ దలపెట్టి ప్రకృత మీగ్రంథమునకు "ఉత్తమస్త్రీలు-మొదటిభాగ"మని పేరిడితిని. కనుక నెల్లవారును దీని నాదరించి నాప్రయత్నమును గొనసాగింప నాంధ్రలోకమును బదింబదిగఁ బ్రార్థించుచున్నాఁడను. మఱి గురిగింజనలుపు గురిగింజకుఁ దెలియనియట్లు, నాకుఁ దోఁపని లోపము లొకకొన్ని యీగ్రంథమున నుండిన నుండును. "ప్రమాదో ధీమతా మపి" యని యుండఁగా నిఁక నాబోఁటి కించిజ్జ్ఞునకు భ్రమప్రమాదజనితదోషములు లేకపోవునా ? కావునఁ బండితులు దోషాన్వేషణపరాయణులు కాక, గుణగ్రహణపారీణు లై, నీరమును వేఱుపఱిచి క్షీరమును గ్రోలు రాజహంసముమాడ్కి నసారమును ద్రోసిపుచ్చి సారమును గ్రహించి నన్నుఁ బ్రోత్సహింపఁ బ్రార్థితులు. ఇట్లు,

బుక్కపట్టణము రామానుజయ్య.

## పణ్డితాశీః

---

శ్లో. ఇహ రామానుజసుకృతిః
కృష్ణసురుక్మిణ్యుపయమశివభావః ।
జయతి విలసత్పదార్థ
శ్శర్వాణీదర్శనాప్తమాఙ్గల్యః ॥

శ్లో. ఏతాదృశకృతివితతిమ్
మాతా జగతాం ప్రసాదయ త్వస్య ।
పూతాశిష మిత్యకరోత్
ఖ్యాతోపద్రష్టృసుబ్బరాయకవిః ॥

---

# ఉపోద్ఘాతము

శ్రీ భాగవతాదులందుఁ గల యీరుక్మిణీకల్యాణము ముఖ్యముగా నాంధ్రలోకమందు మిక్కిలి ప్రసిద్ధమై యున్నది. ఈచరిత్రము పరమపవిత్ర మగుటయే కాక బమ్మెరపోతనామాత్యుని కవితామృతలహరిచేఁ బూరితమై యుండుటంబట్టి యతిమనోహరమును నత్యంతభోగ్యము నై యాంధ్రులందెల్ల వ్యాప్తి నొంది యున్నది. దీనిని బడి యందుఁ బాఠము చెప్పని పంతులును, జదువని బాలుఁడును బాలికయును, బెండ్లిపేరంటములయందుఁ బాడని యువతియు, నుబుసుపోకకుఁ జెప్పుకొనని ముసలవ్వయుఁ బూర్వ ముండుట యరుదు. ఇప్పుడు క్రొత్తగా బయలువెడలుచున్న పాటలును బాఠపుస్తకములును, దమ రచనామాధుర్యమునుబట్టి కాని స్వభావవర్ణనావిలసనమునుబట్టి కాని దీని నించుకయినను బోల కున్నను బాఠశాలావిధుల కనుకూలముగా నుండుట యను యోగ్యతావిశేషమునుబట్టి దీనిని దఱిమివైచుచున్నది. కాని యిందలిశబ్దార్థాలంకారబీజములు బాల్యమందే చదువరులమనంబుల నాటుకొని ప్రౌఢవయస్సున సాహిత్యఫలప్రద మగుటను బాటించుట లేదు. మహాకవితాశైలి ప్రథమాభ్యాసకులకు దురూహమఁట! దీనియొప్పిదమె కదా దీనియనర్హతకు మూల మయ్యె? అన్నిగుణము లుండియు నావిధుల కనుగుణము గాదఁట! తదానుగుణ్యమె బాలపాఠయోగ్యతాసూచక మని నూతనసిద్ధాంతము గదా. మఱి యీచరిత్రమె కవితారస మొలుకునట్లును, బాఠశాలావిధుల కనుకూలముగా

నుండునట్లును మఱియొకరూపమునఁ బద్యముననో గద్య
ముననో యల్లి వెల్లి విరియించినచో నిది పూర్వవ్యాప్తిని
మరలఁ బడయవచ్చునుగదా! మరల బాలురహృదయము
లందు మున్నపోలె సాహిత్యరసబీజావాపము చేయవచ్చును
గదా!

అట్టిరూపమున నిపు డీరుక్మిణీకల్యాణము వచనమున
రచింపఁబడిన దని చెప్పఁదగి యున్నది. ఇం దాయాసంద
ర్భములందలివర్ణనము లనఁగా నవతారిక, శ్రీకృష్ణప్రశంస,
బ్రాహ్మణదౌత్యము, శ్రీరుక్మిణీహరణఘట్టము మొదలగునవి
మనోరంజకము లై కవితారస మొలుకుచున్నవి. మఱియు
నిప్పటిపాఠశాలావిధుల కనురూపముగా నుక్తిప్రత్యుక్తికల
తోను బ్రబంధవిభాగములతోను దక్కినయానుకూల్యముల
తోను గూడి యుండుటంబట్టి శ్లాఘ్యముగాను నున్నది.

శైలి మృదువు. వర్ణనములు రమ్యములు. అందందు
స్వకపోలకల్పితములతోఁ గూడినప్రబంధసంవిధానము సుంద
రము. కాన నీచరిత్రమును నవీనమార్గమున రచించి పండి
తులకు రంజకమును బాలుర కుపయుక్తమును గావించిన
బ్ర. రామానుజయ్యగారు ప్రశంసార్హులు.

6-10-1916
మద్రాసు.

ఇట్లు,
తంజనగరము తేవప్పెరుమాళ్లయ్య.

ఓమ్

# అంకితము

శ్రీ సౌదామిని సంతతంబు మెఱయన్
జెల్వారు చిష్టార్థపూ
రాసారంబుల సాధుచాతకము ల
త్యానందముం జెందఁగా
వాసిం గైరవిణీతటంబునను దీ
వ్యద్దాససస్యౌఘ ము
ల్లాసం బొందఁగఁ బొల్చు నాఘనుఁడు లీ
లం గైకొనున్ మత్కృతిన్.

## కవి స్తుతి.

సీ. వ్యాసవాల్మీకుల వాసిగా వినుతించి
కాళిదాసాదుల గణుతి సేసి
నన్నయ తిక్కన నాచనసోమన
శంభుదాసాదుల సంస్తుతించి
పోతన శ్రీనాథ కేతనలకు మ్రొక్కి
భాస్కరాదుల కెల్లఁ బ్రణతి సేసి
పింగళిసూరన పినవీరభద్రులఁ
బెద్దనాదుల నెల్ల వినుతి సేసి
తే. రామరాజవిభూషణు రామకృష్ణు
స్తోత్ర మొనరించి చిన్నయసూరిఁ దలఁచి
'యాంధ్రవాల్మీకి' యన నొప్పు నాత్మగురునిఁ
బొగడి యీగ్రంథరచనకుఁ బూనినాఁడ.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

# రుక్మిణి

## అ వ తా రి క.

అన్ని దిక్కులనుండి యడవిమెకములు పాఱిపోవుచుండెను. వానిని వెంటాడుచు నొకమేటివిలుకాఁడు శరపరం పరలఁ బుంఖానుపుంఖముగ నేయుచు నేలఁ గూల్చుచుండెను. అప్పు డాతనిగుఱి దప్పించుకొని యొకచక్కనిజింక చివుక్కు చివుక్కునఁ జవుకళించుచుఁ జాలదూరము పాఱిపోయి యొక తపోవనమునఁ గనుమొఱంగెను. దానిని దఱుముకొని పోయి నందున, నలసటచే నీరువట్టును గొని, యట నెందును నీటి పట్టును గానక, సమాధినిష్ఠ నుండిన శమీకుం డను నొక తపోనిధిదండకుఁ బోయి, "యోయి మునీశ్వరా! నేను దాహ ముచేఁ దహతహ చెందుచున్నాను. కొంతతోయము దయ చేయు" మని యడిగి, యతఁడు పలుకకుండుటను జూచి, యతికుపితుఁ డయి "యౌరా! 'వచ్చెను ధాత్రీపతి' యని సంభ్రమముతో నన్ను సత్కరింపఁడు. ఘలుకరించియును బలుకఁడు. కందోయి విచ్చియుం జూడఁడు. వీఁ డెంతగర్వి ష్ఠుఁడు! మునియైనవాఁడు గుణగరిష్ఠుఁడుగ నుండవలవదే!" యనుచు, ముక్కుపై వ్రేలిడి తల యూఁచి, తనయండను బడి యుండిన యొకమృతోరగమును వింటికొప్పుతోఁ బై కెత్తి, మిగులనేపుతో "నోతపసీ! నే వచ్చినదే కైదండ

యిచ్చి కూర్చుండఁబెట్టి యెంత సత్కరించితివి! పురే! యింతహితకరుండ వగునీకిదే పూదండ సమర్పింతు" ననుచు నతనిమూఁపున దానిని వైచి తనపురమున కరిగెను.

జటాజూటమునకును విభూతిరేఖలకును రుద్రాక్షములకునుఁ దోడుగఁ గంఠమునఁ బా మొక్కటి యెక్కువ యగుటచే, నామునీశ్వరుఁడు తన్మయతవలన శివస్వరూపమే చెందెనో యన నొప్పుచుండెను. ఆజడదారిబుడుతఁడు శృంగి యను నతఁడు వచ్చి చూచి, యితరమునికుమారులవలనఁ బరీక్షిత్తొనర్చిన కార్య మని విని పటురోషము గొని "యీపామును వైచినయాభూమిపాలకుఁడు సప్తమదినమునఁ దక్షకఫణీంద్రముచేఁ గఱవంబడి చచ్చుఁగాత" మని శపియించి, పితృసాన్నిధ్యమునకు వచ్చి నిలఁబడి, యా పెనుఁబాఁపపీనుఁగు దిగియ నేరక, కుయ్యో! మొఱ్ఱో! యని కూఁకలు వెట్టెను. సమాధి గలఁగుటచేఁ దండ్రి కనులు దెఱచి చూచి, యామృతోరగమును దీసి యవలఁ బాఱవైచి, కొడుకును జూచి వృత్తాంతము నడుగ, నతఁడు పరీక్షిత్తొనర్చిన కార్యమును దా నందుల కట్లు శపించుటను దెలిపెను. ఆసాధుసత్తముఁ డదరిపడి, పుత్త్రునపకృత్యమునకు నెంతయు సంతాపపడుచు "నాహా! మహారాజు మనకుటీరమునకుఁ గర మరుదుగ నరుదెంచుచు, నాతనికి మరియాద లాచరించి హితములతో సత్కరించి సంతోషపఱిచి యనుపఁగలధన్యులము గాకుండియు, నతఁ డేవో నాపైఁ బాము వైచెనఁట. పాప మతఁ డెంత పిపాసచేఁ బీడింపఁబడెనో కాని, మనవలన ననుకూలత కలు

గమిచేఁ గోపము గొని యీపని సేసె. నీ విది యొకగొప్ప తప్పుగా నెంచి, పరమభాగవతుఁడుగ నొప్పు నాప్రభున కేల యీబలుశాప మిచ్చితివి? వృథా నేఁటికి పాపము మూటగట్టి కొంటివి కదా! ఆయుత్తరాకుమారుఁ డుత్తరాకుమారుఁ డని యెంచితివి కాఁబోలు. ఆయభిమన్యుసూనుఁడు కలిపురుషుని నిగ్రహించి ధర్మమును నాలుగుపాదముల నిలిపి రాజ్యమేలు చుండుటంజేసి కదా యీరాజ్యము రామరాజ్యమై చెలఁగుచున్నది! ఆతనిమహానుభావమువలననే కదా యీ రాష్ట్రమున క్షామము లోనగు నుత్పాతము లుప్పతిల్లక క్షేమముతో వర్ధిల్లుట! మనము నింతసుఖముగాఁ దపముసేసి కొనుచుండుట! అకటా! యిఁకమీఁద నెట్టివికటములు కలుగనున్నవో! రాజ్య మరాజక మయి, యక్రమములు మెం డయి, జారత్వచోరత్వములు బలిసి, వర్ణాశ్రమాచార ధర్మములు క్షీణించి, వర్ణమిశ్రమము లవును గదా! నీవు కొండికవు గావున నేదియు నాలోచింపక యాతురపడి శపించితి" వని పరిపరివిధములఁ బరితపించి, చేయునది లేక, ఛాత్రనివహమునందలి యొక్కనిం జీరి "నెవ్వడిఁ బోయి కవ్వడిమనుమని కీశాపవృత్తాంతము దెలిపి ర" మ్మని యని పెను.

అంత నాపిడుగువంటిబెడిదపుమాట పరీక్షిన్నరేంద్రుఁడు వినఁగానే, గుండియలు ఝల్లు మని కాయము కంపించి, మూర్ఛితుఁ డై కొంతసేపటికిఁ దెప్పిఱిలి, యత్యంతచింతాక్రాంతస్వాంతుఁ డై "యహో! నే నేల వేఁటాడఁ బోవల

యును! పోయితిఁబో, నా కేల యక్కడ దాహ మెత్తవల
యును! దాహ మెత్తిన నేమి? కలయ వెదకియు జలాశయము
కనుపట్టకుండవలయునా! కన్పట్టకయుండెను సరే, నే నంత
టితోఁ బురికి సురిఁగిరాక, యక్కటా! మౌనముద్రను ధరించి
యున్న యీయోగిశ్రేష్ఠుఁడు యోగనిష్ఠ నున్నాఁ డని వివే
చింపక యవివేకి నై యచ్చటఁ బడి యుండిన యీ చచ్చిన
పామును నే నేల పూనికతో నెత్తి నిరపరాధి యయిన జడ
దారిమెడకుఁ జుట్టి రావలయును? ఇయ్యది నాదుకడిమిగర్వ
ముచేఁ బొడమినదుర్బుద్ధిగాదే? ఉండనీ, అట్టి నాపొట్టపొగరు
చేతఁ జుట్టి వచ్చితిని. ఆరుసికొమరుఁ డది తెలిసి, కోపింపక
'యేమొ పో, రాజ్యమదమునఁజేసి యీ తప్పిదమును జేసె.
ఇంతమాత్రమునకా శపింప నెన్నుట? శపియింప వలయు
నన్న నెంతమాత్ర' మని క్షమింపరాదా? సుంతైన దయ
లేదా? కట్టా! యిట్టిబెట్టిదపుశాపము పెట్ట నెట్టతనియెదను
దలంపు పుట్టెను! ఇట్టులు మట్టు మీఱునట్టు తిట్టను నోరెట్టు
లాడెనో!" యని పలుదెఱంగులఁ బలవించి, ప్రతిశాపం బియ్య
సమర్థుఁ డయ్యు నందుల కియ్యకొనక "యీతని నెగ్గాడుట
సరికాదు. మనకు మృత్యువు సమీపించినది. అదియు నీనెప
మువలనను రావలసెను. మఱియు, నా కని యక్కడఁ బడి
యుండిన యీపాఁపకళేబరము నాపాలికాలపాశము కాఁబో
లును. ఆతపోవనమునకు ననుఁ దీసికొనిపోయి మాయ మైన
యీహరిణము మృత్యుదేవత కావలయును. ఆహా! దైవగతిని
దప్పింప నెవరితరఁ!" మని చింతించి, "జాతస్య హి ధ్రువో

మృత్యు వనునట్లు పుట్టిన దే చావు సిద్ధమేకదా'' యని శిరము పంకించి, యెట్టకేలకు ''భామవ్యోమసుఖము లల్పములు ననిత్యములు. శ్రీహరిచరణస్మరణ మత్యుత్తమము; భవవ్యాధిభేషజము; ముక్తిపదప్రదాయకము; శాశ్వతసుఖసంధాయకము. కావున నదియ యవశ్యకర్తవ్య'' మని యుంకించి, వైరాగ్యము వహించి, జ్యేష్ఠతనయుని జనమేజయుని రప్పించి, యాతనికి సర్వస్వము నొప్పించి, రాజ్యమును బాలింప నుత్తరువిచ్చి, తాను భాగీరథీప్రాంతమున కరిగి, యటఁ బ్రాయోపవిష్టుఁడై తనదుహృదయపంజరమున హృషీకేశుఁడను రాజకీరము నునిచికొని చంచలత యను మార్జాలమును రానీక జాగరూకతతో నుండెను.

ఈయుదంతము విని సంతాప మొంది నారదాంగిరసపర్వత భరద్వాజాత్రి గౌతమ వసిష్ఠ విశ్వామిత్రాగస్త్య కణ్వ దేవల పరశురామ పరాశర వ్యాస ప్రభృతి దేవర్షి బ్రహ్మర్షి రాజర్షి గణంబు శిష్యకోటిసమేతముగా నాచోటునకు వేంచేసెను. అంత నా విరజస్తముఁడు భరతకులసత్తముఁడు సానందుఁడై వారలకు సాష్టాంగదండప్రణామ మొనర్చి కూర్చుండ వేఁడి, చేమోడ్పుతో నిజవృత్తాంతము సాంతముగ విన్నవించి, ''తాపసవర్యులారా! పాపవిమోచన మొనరించి కృతకృత్యునిఁ జేయుఁడు. 'కాలము ఝురీవేగతుల్యము; కాయము బుద్బుదప్రాయ' మని వచించెడి మీబోఁటి పెద్దల సుద్దు లింతదనుక మనసునకు స్ఫురింపక కాలహరణము సేసితిని. నా యీచరమదశయందుఁ బరమ

పురుషుని పవిత్రచరిత్రములు మీరు వినిపించి నాదుజన్మము సార్థకము గావింపుఁ''డని వేవిధంబులఁ బ్రార్థించు సమయమున, నాతని పుణ్యావశమ్మున నయ్యెడకు సద్గుణాలయుఁడు జ్ఞానభక్తిమయుఁడు విజితేంద్రియుఁడు నగు శుకబ్రహ్మము విజయంచేసెను.

అంతట నాతనిప్రభావము నెఱిఁగినవా రగు నామునిపుంగవులు లేచి యెదురేగి, తాము వేల్పుఁబెద్ద కగ్రాసనమును బొసఁగ నొసఁగి పెద్దసేయుమాడ్కిఁ దమమధ్యమున శుకమహర్షి నుపవేశింపఁ జేసిరి. పాండవపౌత్రుఁడును బరమానందభరితుఁడై శుకయోగీంద్రునికి సాంద్ర మగు భక్తితోఁ బ్రదక్షిణనమస్కృతు లాచరించి, యాతిథ్య మిచ్చి యత్యంతము పూజించెను.

మఱియును దారామండలిమధ్యమున వెలుంగు చలివెలుఁగువలెను దారహారమునందలి నాయకమణింబోలెను మునిజనమధ్యమునఁ దేజోవిరాజమానుఁడైన వ్యాసమహర్షి సూనునిఁ గనుఁగొని పరీక్షిజ్జనవరేణ్యుఁడు కరకమలములు ముకుళించి యి ట్లనియె:

''మునికులసార్వభౌమా! విప్రశాపంబు ప్రాపించి వారములోనఁ బ్రాణవియోగముఁ జెందనుండునాకు సప్రమేయుఁ డగుభగవంతుని గుణకథనములు వర్ణించి చెప్పి, నను ధన్యునిఁ జేయుము. మఱియు సాధుసందర్శనము సర్వపాపనాశకము. భవదాగమనము మదీయభాగ్యసూచకము. శరీరము నశ్వరము. అట్టికాయము పోవుటకై పరితపించుట

హేయము. ఆత్మ నిత్యము. అయ్యాది కడతేర్చుటను జింతిం
చుట శ్రేయము. కావున, మహాత్మా! జన్మసాఫల్యమునకై
సన్మార్గం బానతీయవే" యని వేఁడికొనుటయుఁ, గ్రీడిమను
మని మేలిప్రశ్నమునకు నెంతయు నలరి, "భరతకులప్రదీపా!
ప్రథమగణ్యా మగు నీదు సంప్రశ్నము జ్ఞానులు మెచ్చఁ
దగినయది. నీకు శుభం బగుఁగాక! గృహస్థు లాత్మతత్త్వ
మెఱుంగరు. జననమరణప్రవాహరూప మయినసంసారసాగర
మున ధనేషణ దారేషణ పుత్త్రైషణము లను నీషణత్రయ
ముచేఁ జిక్కి, యీశ్వరచింతన దక్కి, ప్రపంచము మిథ్య
యని తెలియక, దినదినము నాయుర్దాయము తఱుఁగుచున్న
దని తలపోయక, వెక్కురులై మురియుచుందురు. భగవంతుని
నాకర్ణించుట వర్ణించుట ధ్యానించుట సేవించుట సకలకలుష
హారమును సర్వశుభకరము నగు. అంత్యకాలమున గోవింద
చరణారవిందసంస్మరణము జన్మరాహిత్యమునకుఁ గారణము.
కావున, వత్సా! పరమపావన మగు భాగవతమహాపురా
ణము వక్కాణించెదను. విన నవధరింపు" మని, యాతనికి
శుకాచార్యుఁడు బ్రహ్మవిద్య బోధించి, భగవంతుని బహు
విధావతారభవ్యచరితములను వర్ణించి చెప్పుచు, భరత
కులతిలకుఁ డగు పరీక్షిజ్జనపాలకునకు వెండియు ని ట్లనియె:
"వత్సా! భగవంతుఁ డగువాసుదేవుని లీలావతారమును
శైశవవైభవమును వింటివి కదా. ఇఁక నాగోపాలుఁడు తనదు
విరోధులను జైద్యమాగధసాళ్వాదులను గలనఁ గెలిచి
భీష్మకపుత్త్రీమణిని శ్రీరుక్మిణిని రాక్షసోద్వాహమునఁ జేకొని

నది చెప్పెద విను" మనవుడుఁ, గ్రిడిమనుమఁడు కౌతుక
మెలర్ప "వాచంయమివర్యా' వాచామగోచరమగు వైష్ణవ
సత్కథనములను నీవు వాకొనుచుండ, నే నూఁకొనుచుండ,
నా కాఁకొనుటయును దాహ మెత్తుటయును లేవు. అమృత
మును గ్రోలునటు లానంద మంతకంతకు నభివృద్ధి నొందు
చున్నది.

ఇంతియ కాక,

క. భూషణములు చెవులకు బుధ
తోషణము లనేకజన్మదురితౌఘవిని
శ్శోషణములు మంగళతర
ఘోషణములు గరుడగమను గుణభాషణముల్.

(భాగవతము.)

కావున, మహానుభావుఁ డగు వాసుదేవుని కల్యాణము
విన నువ్విళ్లూరుచున్నాను. సాకల్యం బేర్పడఁ జెప్పు" మని
ప్రార్థింపఁగాఁ, బార్థివేంద్రునకు వ్యాసనందనుఁ డిటులు
వాక్రుచ్చెను.

౧.వ

# కథా ప్రారంభము



## రాజధాని.

ప్రకృతిస్వరూపములచేతను శీతోష్ణస్థితులచేతను మహాఖండమును బోలిన యీ భరతఖండమునందలి విదర్భదేశమునకు మండన మయి కుండిన మను రాజధాని సర్వైశ్వర్యములతో రాజిల్లుచుండును. అందు విప్రులు వేదవేదాంగపారంగతు లయి విజ్ఞానవిశిష్టు లయి విలసిల్లు చుందురు. క్షత్త్రియు లస్త్రశస్త్రవిద్యలందును గజాశ్వారోహణమందును సమర్థు లయి మహాబాహుబలాఢ్యు లయి యవక్రవిక్రము లయి భండన మన దొడ్డపండుగగ భావించి సంతతము చివ్వకుఁ గాలుద్రవ్వుచుందురు. బేరులు కుబేరునింబలె లక్ష్మీసంపన్ను లయి వాణిజ్యవ్యవసాయములందు సమర్థతాసక్తులు కలిగి పాటువడి యర్థము మిక్కుటముగ గడించి, వ్యర్థముగఁ గూడఁబెట్టక—డమ్మన్నదే దమ్మిడి కూడ నెత్తుకొని పోవువారము కానేరము. ధర్మ మొక్కటే వెంట వచ్చునది యని-దానధర్మములు సేయుదురు. శూద్రులో సదాచారపరు లై యేతద్వర్ణత్రితయమునకు నిష్ఠానువర్తులుగను సదా శుశ్రూషాపరాయణులుగను బ్రవర్తించి సచ్ఛూద్రు లనిపించుకొందురు. వీరు కాక కావ్యేతిహాసప్రబంధనాటకగ్రంథముల గుణరసాలంకారభావితముగను భావగర్భితముగను విరచిం

చుటయందుఁ బ్రవీణు లవు సత్కవులును, నిజకటాక్షవీ
క్షితశారదు లయి విద్యావిశారదు లయి తర్కమీమాంస
జ్యోతిషవ్యాకరణాదిశిక్షల విచక్షణు లయినవిద్వాంసులును
విరాజిలుచుందురు. శిల్పకళానైపుణ్యముచే విశ్వకర్మకల్పు
లగుశిల్పులును, చిత్రవిచిత్రములుగఁ జిత్తరువులఁ జిత్రించుట
యందు నేర్పరు లగుచిత్రకారులును భాసిల్లుచుందురు. సరస
సంగీతవేత్త లయి రాగతాళజ్ఞానసంపన్ను లయినగాయకు
లును వైణికులును వైణవికులును, మఱి, తోడిభైరవికల్యాణి
మోహనసావేరిశంకరాభరణేత్యాదిరాగప్రయుక్త మగు పల్లవి
పాటలకు సరిగఁ దాళమానములు మెఱయ వాయించుట
యందు సమర్థు లగు మార్దంగికులు నొప్పుచుందురు. భరత
నాట్యమునందుఁ బ్రావీణ్యము మెఱసి, భగవంతునిఁ గూర్చి
భవ్యతమము లగుకీర్తనములు తంబుఱనాదముతో సుస్వర
భాస్వరవికస్వర మగు కంఠస్వరమును మేళగింపఁ జేసి సరస
సంగీత సాహిత్య జ్ఞానసంపదతోఁ బరమశ్రావ్యముగ గాన
మొనర్చి, వీణాది తంత్రీవాద్యముల సధిక సామర్థ్యముతో
వాయించి, సర్వజనుల మనముల సంతోషపఱచు వెల
యాండ్రు వెలయుదురు. మఱియు, సవిస్తారము లగు
సమస్తవస్తువులతోడఁ గూడిన విక్రయాంగణములును, గజ
శాలలును వాజిశాలలును గోశాలలును నాయుధశాలలును
సంస్కృతపాఠశాలలును దాళపత్త్రగ్రంథాలయములును నా
యుర్వేదవిద్యాలయములును వైద్యాలయములును దేవాల
యములును, నగాధములగు నగడ్తలును, నత్యున్నతము లగు

మేడలును, వినోదకరము లగు నుద్యానములును, వినిర్మల జలసమృద్ధము లగు వాపీకూపతటాకములును, నడగొండలో యన నొప్పు మదపుటేనుఁగులును, మహాజవసత్త్వములు గల తురంగములును జెలంగుచుండును.

## రాజకుటుంబము.

అట్టి నగరరాజమును ధార్మికుఁ డగు భీష్మకమహారాజు మతిమంతు లగు మంత్రులఁ గూడి సత్యపరిపాలనము సేయుచుండెను. ఆరాజేంద్రునికి నిజధర్మపత్నియందు రుక్మి రుక్మరథ రుక్మబాహు రుక్మకేశ రుక్మనేత్రు లను నేవురు పుత్త్రులు గలిగిరి. వెండియుఁ గొండొకకాలమునకు నాయిల్లాలు చూలా లగుడుఁ, దానును భర్తయు, 'సీతడవ యాఁడునిసువు పుట్టునా' యని కొండంతయాసతో వెండికొండ వేల్పునకు వేయిమ్రొక్కు లిడుచుండిరి. అంత నవమాసములు నిండుటయు, నారాజకాంత మంగళకర మగునొక పుణ్యదినసమున, మంగళదేవతాంశముతోఁ గూడి, నేత్రోత్సవము సేయు నొక్కకుమారీరత్నమును గనియెను.

అప్పుడు క్షీరసముద్రుఁడు తనదుముద్దుఁగూఁతురు భువి నవతరించె నని పరమసంతోషము నొంది యాచక్కని పాపకై కనకకలశములలో దివ్యక్షీరము నతిత్వరితగతిం బంప, వానిలోనిక్షీర మొలికెనో యనురీతి నానాతి స్తనముల నుండి పాలు స్రవించెను. ఆమెకను లానందబాష్పములతో నిండిపోయెను.

భీష్మకుఁడు తనకుఁ బుత్త్రిక జన్మించినందులకు నమం దానందము నొంది, సత్పాత్రులకు హేరాళ మగుధనాదిక మును ధారాళముగ దానము చేసెను.

సూతికామందిరమునందు దాదు లాబిడ్డ నెత్తుచుఁ బట్టుచు, బాలెంతరాలికిఁ బథ్యములఁ బెట్టుచు భద్రముగఁ గాచుచుండిరి; పదునొకండవనాఁడు తల్లిబిడ్డలను జలక మార్చి పురుడు తీర్చిరి. అపుడు నృపుఁడు తన్నుఁ బురుడు సేయు భాగ్యవంతుఁ-డిలను గలఁడే యని యలరుచు, నప రంజిబొమ్మ నపహసించు తనముద్దులేఁబట్టికి సవిభవముగ జ్యోతిషశిఖామణులచే జాతకము వ్రాయించి 'రుక్మిణి' యని నామకరణము చేయించెను.

## స్త్రీవిద్య.

ఆ చక్కనియాఁడుకూన వృద్ధిచంద్రునిపగిది దినదిన ప్రవర్ధమాన యై వైదేఁడులబాల కాఁగానే రాజచంద్రుఁడు విద్వాంసులను రావించి తనగారాబుఁగూఁతునకు విద్యాభ్యా సము చేయించెను. అది మొద లాబాలామణియు సూక్ష్మ బుద్ధికిఁ దోడు శ్రద్ధయుఁ గలిగి యొజ్జలకు మాటిమాటికిఁ జెప్ప వలసినశ్రమము నీక సూటిగ విద్యలఁ గఱచుచు, నతి శీఘ్రమున సంస్కృతమునను దేశభాషలందును బాండిత్యము సంపాదించెను. ఆమెకు సకలశాస్త్రములు కరతలామలక మయ్యెను. ఆవిదుషీమణిహృదయమే యొకపుస్తకభాండాగార మయ్యెను. ఆగ్రంథశాలకు జ్ఞానమే కార్యదర్శి యయ్యెను. సుగుణగణము పాఠకమహాశయబృంద మయ్యెను.

## రుక్మిణీదేవిబాల్యదశ.

మఱియును ప్రతిదినము రుక్మిణి యించుకతడవు తన యీడుబాలికలతోడఁ గూడి చెండాట యాడును; కొంతసేపు గుజ్జెనగూళ్లు వండి తోడిబాలలకు వడ్డించును; ఒక్కింతసేపు చెలులతో డాఁగురుమూఁత లాడును; ఒకకొంతసేపు తూఁగుటుయ్యెల నూఁగును; ఒక్కించుకతడవు నెచ్చెలులుం దాను నొండొకొర్తెలకుఁ బిట్టకతలు కడు వేడుకగాఁ జెప్పికొందురు; విడికతలు విడిపింతురు; పోఁడిపాటలు పాడుదురు; బుద్ధి కుశలత మెఱయఁ జదరంగ మాడుదురు. ఒకనాఁడు రుక్మిణి తోడిబాలలతోడఁ గూడి మిథునవిగ్రహములను బెట్టుకొని గౌరీశంకరు లని పేళ్లు పెట్టి పెండ్లి యొనర్చును; ఒండొకనాఁ డాజతబొమ్మలను లక్ష్మీనారాయణు లని భావించి కల్యాణముసేయును. మఱియొకనాఁటి కాప్రతిమలకు సీతారాము లని నామము లిడి పరిణయ మొనరించును.

ఈరీతిగాఁ జదువుకొనెడివేళ పోఁగా మిగిలినవేళల నా బాలికామణి సఖులఁ గూడి బాల్యవినోదములఁ దేలియాడుచు దుఃఖ మనునదియే యెఱుఁగక కడు గారాబముతోఁ బెరుఁగుచుండెను.

---

## శ్రీకృష్ణప్రశంస.

అంతట విదర్భభూమీశునకుఁ దనయనుంగుఁదనయకుఁ దగినమగనినిమిత్తము విచారము కలిగెను. ఆయనయాస్థానమునకు సాముద్రికశాస్త్రపారగులును, విజ్ఞానవృద్ధు లగు

వయోవృద్ధులును వాలాయము వత్తురుపోదురు. అట్టిసమయ ములనామచ్చెకంటి నెచ్చెలులతోడ నచ్చటికి వచ్చుటయును దటస్థించును. అప్పుడు వా రాయొప్పులకుప్పను జూచి యుప్పొంగి, "రాజోత్తమా! యీరాజముఖికిఁ దగ్గయుఁ దగిన పురుషుఁడు పురుషోత్తముఁడు ద్వారకావాసుఁడు. ఆతఁడు మన్మథసౌందర్యమును హేమాచలధైర్యమును హిమాచల స్థైర్యమును సాగరగాంభీర్యమును మహాదోర్వీర్యమును మృగ రాజశౌర్యమును విశేషైశ్వర్యమును బరమౌదార్యమును బ్రాకటచాతుర్యమును వచోమాధుర్యమును గలవాఁడై, సాధుజనకైంకర్యధుర్యుఁడై సంశ్రితరక్షణకలాధౌరంధర్యుఁ డై యమానుషకార్యుఁడై యొప్పుచున్నాఁ" డని వచించి మఱియు నిరూపణపురస్సరముగ నీప్రకారము ప్రశంసింతురు:

"అలరాజగోపాలుఁడు—దేవకీవసుదేవసందర్శితదివ్య గాత్రుఁడు పితామహప్రముఖామర్త్యకృతస్తోత్రుఁడు - పూత నాసంహారకుఁడు శకటాసురమారకుఁడు - తృణావర్తదైత్య విదారకుఁడు గోవర్ధనగోద్ధారకుఁడు - నందయశోదానంద వర్తనుఁడు కాళియఫణిఫణానర్తనుఁడు - కబళీకృతదావపా వకుఁడు గోపాంగనాహృదయంగమహావభావకుఁడు - కుబ్జా మనోరంజకుఁడు కువలయాపీడ మదభంజకుఁడు - చాణూర ముష్టికహింసకుఁడు కంసమాతులధ్వంసకుఁడు - అక్రూరా లయపావనుఁడు అఖిలజగన్మోహ భావనుఁడు - దుష్టజనశిక్ష కుఁడు శిష్టజనరక్షకుఁడు - సకలజన మంగళావహుఁడు

లీలామానుషవిగ్రహుఁ" డని యా కోవిదులు గోవిందుని విచిత్రచరిత్రము నగ్గలికముగ నగ్గింతురు.

ఇటులు వారలు శ్రీకృష్ణుని వర్ణించిన నాకర్ణించి భోజ భూజాని యాతనికే తనకూఁతు నొసఁగుటకు మిక్కిలి మనసు కలిగియుండెను.

అంతిపురమున సైతము రాణి మొదలుగా రాణించు రాజకాంతలు బుధులవలనను బంధులవలనను గృష్ణునిఁగూర్చి విని, యదియ యను వగుమను వని తలఁచియుండిరి.

## అన్యోన్యవ్యామోహము.

ఈవిధముగ రాజసభయందును నంతఃపురమునందును వనజలోచనునిఁగూర్చి విని విని రుక్మిణి 'యాతఁడే తగినవరుఁ' డని మనంబున వరించెను. మఱియు, నాతనిప్రశంస వచ్చి నపు డెల్లఁ జెవి యొగ్గి వినుచుండును. శిశుపాలుఁడు భోజవంశ మునఁ జేరినవాఁడు కావున, బంధువులలోని మాటకారులు రుక్మిణిని జూచి "రుక్మిణీ! నీవు చేదిభర్తను బెండ్లియాడె దవా?" యనిన, మండిపడి వారిని గసరును. "అమ్మా! యది పోనిమ్ము. తెలియక యడిగితిమి. కృష్ణమూరిని బెండ్లిచేసికొనెదవా?" యనిన, సిగ్గునఁ దల వంచి నవ్వుచు నట నిలువక తుఱ్ఱునఁ బాఱిపోవును. అపుడు వారలు "అమ్మలారా! మనరుక్మిణి పోయి పోయి నల్లవానిఁ గోరెను జూచితిరే!" యని మేల మాడుదురు.

ఈ పరమకల్యాణి నిరుపమగుణరూపవివేక శీలాతిశయ యశోవల్లిక యెల్ల దేశముల నల్లుకొనియుండుటంజేసి, ద్వారవతియందు యదుకులతిలకుఁ డామ త్తకాశినియే తనకు నుత్తమపత్ని కాఁగోరి యుండెను.

ఈప్రకారము వారిరువు రొండొరులఁ బెండ్లాడవలయు ననెడుకోర్కులు పెచ్చుపెరుఁగుటతో వయస్సు కూడ హెచ్చుచుండెను.

రుక్మిణీయౌవనప్రాదుర్భావము.

అంత నాబాలికారత్నమునకు - నుద్యానవనమునకు వసంతకాలము సంప్రాప్త మగునటులు - నవయౌవన మంకురించెను. ఆచానమెయిఁదీఁగ, రత్నము సానఁబట్టినటులు, ప్రజ్వలించెను. ముఖకమలము వికసించెను.

---

దర్బారు.

పదపడి యొకనాఁడు భోజభూకాంతుఁడు పురోహితమంత్రిసామంతబంధుమిత్త్రులతోడఁ గొలువుకూటమునఁ దనచిన్నారితనయకు నను వగు మనువువిషయమై యాలోచించు తఱిఁ గఱివేల్పును బ్రస్తావించెను. అది విని రుక్మి యను పెద్దకొడుకు "ఎట్టెట్టూ ? మనరుక్మిణిని దుద కాపశుపాలునకా యూ నిశ్చయించితివి. కాకిమెడకు దొండపండు కట్టునటులున్నది ! చాలుఁజాలు. మేలు పలికితివి. అఱువదియేండ్లు చెల్లి యరులుమరు లాయెను. నాదుస్నేహితునికి సుగుణభూషితునికిఁ జేదిభూపాలునికి శిశుపాలునికి నియ్యఁ బూనుము. నీ

వెడఁగుతనము మాను" మని యధిక్షేపించి [illegible] నిర్బంధించెను. ఆవృద్ధరాజు పుత్త్రవాత్సల్య[illegible]లనను. వాని మాట జవదాఁటలేనివాఁ డగుటవలనను లో[illegible]డి, వానియి ష్టముచొప్పున నొప్పుకొని శిశుపాలునకు శుభ[illegible]

---

## బ్రాహ్మణదౌత్యము.

ఈ వృత్తాంతమును విని రుక్మిణి కడుంగడు విచార గ్రస్తయై కర్తవ్యము యోజించి, నెచ్చెలిని బంపి పరమాప్తుఁ డగు నొకబ్రాహ్మణుని రావించి, యాతని కెరఁగి కన్నుల నీరు వెట్టుకొని "యోధరామరా! నాదౌర్భాగ్యము వింటివే! దురాత్ముఁడు నాయగ్రజన్ముఁడు రుక్మి యనువాఁడు నన్నుఁ 'జైద్యునకే యిచ్చెద' నని పట్టు పట్టియున్నవాఁడు. నా తండ్రియు 'నట్ల కాని' మ్మని, యొక కమ్మను లిఖించి శిశు పాలునికిఁ బంపినాఁడు. కనుక, నాపయి జాలి గొని సత్వర ముగ ద్వారకానగరమున కేగి వనమాలికి నామనోరథమును నందుల కాటంకముగ నాపెద్దన్న చేసిన వివాహనిశ్చయమును దెలియం జెప్పి యతని వే[illegible] యిచ్చటకు [illegible]తేవే" యని వేఁడుకొని యొక లేఖను లిఖించి, యది[illegible] నున కొసంగఁగోరెను.

---

## ద్వారకాప్రయాణము.

"అమ్మాయి! నేఁ[illegible] విని యెదను. [illegible] కుండుము. శీఘ్రకాలముననే యతనిం దోడ్కొని వచ్చెద" నని యప్పుడే 'జయ పరమేశ్వర' యని బయలుదేఱి ఘూర్జర

మార్గము వట్టి హుటాహుటిగ నడచుచు, నూరువల్లెలు బట్టణమ్ములు పెక్కులు గడచిపోవుచుండెను. అట్లు పోవునప్పు డాసాధుశిరోమణి పరమాత్ముని ధ్యానించుచు నొకపరి 'పాహి మాం పరమప్రభో!' యనును. ఒకసారి 'రక్ష తు మాం రమాపతే!' యనును. వేఱొకసారి 'నమః పార్వతీపతయే హర! హర! మహాదేవ! యని యుచ్చరించును. మఱియొకమాఱు 'స్వామిన్! దయానిధే! సర్వలోకశరణ్యా!' యని పరబ్రహ్మ స్వరూపమును సంస్మరించును. ఇట్లు లా వైదికశిఖామణి పారమార్థికచింతతో నరిగి యరిగి, యవనసముద్రతీరమును దఱిసెను. ఆసముద్రము దిఙ్మండలమునఱకు నీలంపుదుప్ప టముంబోలెఁ గన్పట్టుచుండెను. అది తరంగములచేఁ జెల రేఁగుచు ఘూర్ణిల్లుచుండెను. మీనములు మిట్టిపడుచుండెను. అందుఁ బయనించు నౌకలు దూరమునఁ జూపట్టుచుండెను. చల్లనిగాలి వీతెంచుచుండెను. ఒడ్డున సైకతములు చెన్ను మీఱుచుండెను. ఈరామణీయకమును దిలకించి బ్రాహ్మణ కులతిలకుఁడు భగవత్సృష్టివైచిత్ర్యమున కచ్చెరు వొందుచు, నటనుండి కదలి చని యనతికాలముననే, సిరి నిచ్చలు కాఁపు రము సేయు ద్వారకాపురమును జేరెను.

## ద్వారకాపురి.

అందలి గోపురద్వారములు మంటపములుఁ బ్రాకార ములుఁ గోటలుఁ దోఁటలుఁ దటాకములుఁ గనులపండువుగ నాతఁడు గనుంగొనుచుఁ జని, రాజవీథులందలి రమ్యహర్మ్య ములును వాడవాడలమేడలగోడలపైని జిత్రింపఁబడిన శ్రీకృష్ణ

లీలావిలాసములును మార్గవశమ్మునఁ జూచుచుం బోవుచు,
నొక్కచో నొకానొక వెలవెలంది వేణుగానవిలోలునిఁగూర్చి
యొకజావళి పాడుటను శ్రవణానందముగ నాలకించుచు, వే
ఱొకచో నొకయాటవెలఁది గోపికామనోహరునిగుఱిచి యొక
తేటగీతిని శ్రావ్యముగఁ బాడుచు నభినయించుచుఁ దైతక్క
యని యాడఁ, జూపఱు 'బళి! సెబాస్! బాగు బా!' యని
కొనియాడ, నదియుం దిలకించుచు నేదిక్కునఁ జూచిన,
జనులు కృష్ణప్రశంసయే చేయుచుండుటను వీను లలర నా
లించుచు నాలస్యము సేయక సాగిపోయి రాచనగరు చేరెను.
హజారమున సామంతరాజులు చాలఁగాలము ద్వారకానాథుని
దర్శనమునకై కాచుకొని ప్రభువు నుత్తరువునకు వేచియుండు
టను బ్రాహ్మణుఁడు కాంచెను. బ్రాహ్మణులకు నడ్డంకి లేదు.
ధారాళముగ లోనికిఁ బోవచ్చును. ఆ విప్రోత్తమునిఁ గనుఁ
గొన్నతోడుతనె, యం దొకద్వారపాలకుఁడు శీఘ్రంబున
నంతఃపురమునకుం బోయి, విభునకు విప్రాగమనంబు విన్న
వించిన, నాద్వారకాపాలకుఁడు సంభ్రమంబు గొని, సత్వర
ముగఁ దోడుకొని రా నుత్తరువుచేసెను.

---

## అంతఃపురము.

వాఁడును 'చిత్తము దేవర!' యని త్వరితముగ వచ్చి
యాభూదేవునిఁ గొనిపోయి సౌధంబుఁ జేర్చెను. అంత,
బ్రాహ్మణప్రియుం డగు వాసుదేవుం డాసనంబు వాసి యెదు
రేగి 'దాసోహ' మ్మని దండవత్ప్రణామమ్ము గావించిన,
'శీఘ్రమేవ వివాహసిద్ధి రస్తు' -అని దీవించెను. అందులకు నంద

నందనుఁడు మందస్మితము చేసి యాతనిఁ గాంచనపీఠము
మీఁదఁ గూర్చుండఁబెట్టి యొకజాళువాజాలవల్లికలోఁ బాద
ములఁ బాద్యముచేఁ గడిగి బత్తి మీఱఁ దనయుత్తరీయమునఁ
దడి యొత్తి, యాతీర్థమును మూర్ధముపైఁ జల్లుకొని, పూజించి,
రాజభోజనం బగు పంచభక్ష్యపరమాన్నములు పెట్టించి కడుఁ
బ్రీతితో విచారించెను.

అనంతరము, ధరామరుని సుఖాసీనునిఁ జేసి, రామా
నుజుఁ డాతనియడుగుఁదమ్ములను- శంఖచక్రములు పట్టు కర
పల్లవముల- మెల్లన నొత్తుచు నతనితో నిట్లు మంగలించెను.
"భూసురవర్యా! మీయట్టిమహాత్ము లిచ్చోటికి విచ్చేయుటం
బట్టియే యియ్యది భవన మయ్యెను. లేకున్న, వనముతో
సాటియే కదా. ఇవ్విధముగా మద్గృహము పావనము సేసి
నన్ను ధన్యునిఁ జేయన కాదె మీరు వేంచేసినది!—విప్ర
కులావతంసా! యేసీమను మీవాసము? దానికిఁ బ్రభు
వెవ్వఁడు? అతఁడు ధార్మికుఁడే? సర్వజనరంజకుఁడే? అతని
వలన మీకుఁ గుశలమే? రాజ్యము సాధుజనపూజ్యమే?
తత్పురజనులు సత్ప్రవర్తనులే?" యని మాటకారి యగు
శౌరి కుశలప్రశ్నము సేసిన, నందుల కతండు "పుండరీకాక్షా!
కుండిననగరము మామకనివాసము. దానికిఁ బ్రభువు భీష్మక
నామకరాజవరేణ్యుఁడు. ఆతఁడు ధార్మికుఁడే; సర్వజనరంజ
కుఁడే. ఆతనివలన నాకుఁ గుశలమే. రాజ్యము సాధుజన
పూజ్యమే. తత్పురజనులు సత్ప్రవర్తనులే" యని ప్రత్యుత్తర
మిచ్చెను. కృష్ణుఁ డది విని "బళిరయ్యా! యయ్యదియ నగ

రము. అట్టిగుణములు కలుగకున్న, గరము కాఁ దలఁపవలదే.
అటు లుండని రాజు తరాజు కదే!" యని యానందించెను.

అపుడు ధరణీదేవుఁడు దేవదేవుఁ డగు వాసుదేవుని యుపచారములకును హితవచనములకును భక్తసౌలభ్యమున కును నెంతయు సంతసించి, యొకపరి కనులు మూసి విచ్చి చూచెను గదా—వేదవిత్తముఁ డగు నావిప్రసత్తముఁ డం దెల్లెడల విలసిల్లుచున్న నిలువుటద్దములందు విష్ణుత్వము బహిః ప్రకాశముగా నిజహృద్ధ్యానగమ్య మగు శ్రీకృష్ణుని దివ్య రూపము ప్రతిబింబించుటను గాంచి 'సర్వం విష్ణుమయం జగ' త్తను వేదవాక్యమును సంస్మరించి, వచ్చినకార్యమునుగూర్చి వనజాక్షునితో ని ట్లనియె:

---

## రుక్మిణీగుణరూపవర్ణనము.

ఆరాజేంద్రునకు రుక్మిణి యని యొకకన్యకామణి కలదు. శ్రీగంధముతోఁ గర్పూరకుంకుమములు మిళిత మయి మిక్కిలి పరిమళించుపగిది నామెరూపమునకుఁ దోడు సద్గుణ మును వివేకమును వెలయుచుండును. కావున, నీ వామగువకు నీ కామగువయుఁ దద్దయుఁ దగుదురు. ఇది తథ్యము. ఆ కల్యాణి నీకే దాస్యము సలుపఁ గోరి కల్యాణాత్మక మైన సందేశము నీకుఁ బంపెను. అవ్వారాంగనరూపలావణ్యము లభి వర్ణించెద నాకర్ణింపుము:—పదములు పద్మములు – జంఘలు కాహళలు – మధ్యము మృగేంద్రమధ్యము – కరతలములు పల్లవములు – కంఠము శంఖము – అధరము పద్మరాగము – రదనములు కుందకుట్మలములు – నాసిక చంపకప్రసూనము –

లేఁజెక్కులు నిగ్గుటద్దపుముక్కలు – శ్రవణములు శ్రీకార ములు – నయనము లిందీవరములు – నెమ్మమొగ మిందుచంద్రుఁడు – మందహాసము చంద్రకాంతివిలాసము – కంఠస్వనము వీణానిక్వణనము – కేశవేశము భ్రమరపాశము – తనుద్యుతి సౌదామని – తనువు తీవ.

ఈరీతిఁ బద్మినీజాతిసాముద్రికలక్షణముల నొప్పుచక్కందనము గలయాచక్కరబొమ్మ యొకకమ్మను లిఖించి యిచ్చెనని యద్దాని నాతని చేతి కిచ్చెను. యదుకులతిలకుఁడు మొలక నవ్వులు మోమునఁ దులకింప, నది యందుకొని, విప్పి చూచి, యాణిముత్యములంబోని గుండ్రని యక్కరములను మెచ్చి, యక్కఱ మీఱ నిట్లు చదువుకొనియెను:

## రుక్మిణీలేఖ.

భువనైకసుందరా !

భవదీయసచ్చరితము నిచ్చటికి నిచ్చలు వచ్చుచుండెడు సాముద్రికశాస్త్రపారీణులవలనను బుధజనులవలనను వీనుల విందుగ విని విని పిన్ననాఁడుమొదలు నిన్నె కోరియున్నదాన. నా తల్లిదండ్రులును నీవే యల్లుఁడు కాఁగోరియుండిరి. నాపెద్దన్న రుక్మి యనువాఁడు చైద్యునకే నన్నీయవలయు నని చలము తోడఁ బంతమాడి చేదిపతికి లేఖ నంపియున్నవాఁడు. నేను నిన్నుఁ దక్క నన్యుని, నీదుపదములయాన కోరనిదానఁ గాన, నాశిశుపాలుని గిశుపాలుని వరియింప నొల్లనే యొల్లను.

తొల్లి రావణాసురుఁడు దుర్మోహము గొని లోకమాత యగు సీతాదేవిని రామచంద్రుఁడు లేనిసమయము చూచి

కొనిపోయినట్లు చైద్యుఁడు దుర్మదాంధుఁడయి నీయర్ధాంగి నగునన్నుఁ గొనిపోయెద నని కనుపెట్టి యున్నాఁడు. కావున నీవు కరుణించి యతిరయమునఁ జతురంగసైన్యములతోఁ దరలి వచ్చి, చైద్యమాగధాదివైరివీరుల నని నిర్జించి, నీదుపరాక్రమమే కన్యాశుల్క మొనరించి రాక్షసవివాహమున నన్నుఁ జేకొని పొమ్ము వచ్చెదను. అయిన, నంతిపురమున నుండునింతి నెటులు తేనగు నని యాలోచింపఁ బని లేదు. అందులకు నదుపాయం బొండు గలదు. పెండ్లికి ముందు పెండ్లికూఁతును మావారు కులదేవత యగు హైమవతికి మ్రొక్కఁ బంపుట కులాచారము. ఏను నట్ల నగరు వెల్వడి పోయి పార్వతీదేవికిఁ బ్రణమిల్లునపుడు నను గొనిపొమ్ము. నీ వుపేక్షించుపక్షమున, నేను నిన్నె చింతించుచుఁ బ్రాణము ల్విడిచి యెన్నిజన్మములకైన వ్రతము లాచరించి యాచరించి నిన్నె పెండ్లాడుదానను.

మదీయ మానససరోవర రాజహంసా! యదుకులోత్తంసా! పాపధ్వంసా! నీమంజుభాషల విననిచో నీశ్రవణ రంధ్రములకలిమి యేల? పాముల కిరవగు పాడుబొందలకుఁ గూడఁ దీసిపోయినవే యగును గదా? నీ వనుభవింపనిచో, మెఱపుఁ బోని యొఱపు గల యీమేనితీవలావణ్యమునకుఁ బ్రయోజన మేమి? నిన్ను క్షణక్షణమును వీక్షింపని చక్షువులసులక్షణ మది యేల? గవాక్షమునకును లేవా కన్నులు? నీదునధరసుధారస మానలేని జిహ్వకు వివిధమధురఫలరసాస్వాదనము దా నెందులకు? నీవనమాలికగంధము నాఘ్రాణింపని. ఘ్రాణమునకు బహువిధ పుష్పవాసన లెందులకు?

వే యేల, నీకు సదా సేవ సేయుజన్మమే జన్మము. నీపైని భారము వైచితిని. నీవే నా కేడుగడ యని నమ్మితిని. స న్నీఁకఁ బాల ముంచినను నీవే, నీట ముంచినను నీవే.

భవదీయశీఘ్రసమాగమముకై నిరీక్షించెడి

భవద్విధేయురాలు

కుండిననగరము. రుక్మిణి.

## శ్రీకృష్ణప్రయాణము.

అని యిట్లు చదువుకొని, మొగమునఁ జిఱునగ వొప్ప విప్రవరునిఁ జూచి "సాధుసత్తమా! నాకును నాయన్నల మిన్నపై నెన్నరానిమోహము. కాన నే నెన్నఁడు సుఖసుప్తిం జెందుట లేదు. నావివాహము సహింపక యసూయాపరవశుఁ డై జాల్మ్యుఁడు రుక్మి యనువాఁడు తలఁచుకీడు నే మున్నె యెఱుఁగుదును. సాత్త్వికపుంగవా! కమలముకోమలతను హంస మెఱుఁగునే కాని బక మెఱుంగునా? క్రొమ్మావి చివురురుచి కోకిల మెఱుఁగునే కాని కాక మెఱుంగునా? 'మొప్పె కేమి తెలియును మొగలిపూవాసన?' యనునట్లు వాఁడును వివేకము లేక యాప్రకారము చేసెను. అయిన నేమి? తొలుత వైనతేయుఁ డింద్రలోకమునుండి యమృత కలశమును వాలుమగంటిమి చూపి వడిఁ దెచ్చినకైవడి, దుస్సంధు లగు జరాసంధాదిపరిపంథిరాజవీరులనడుమనుండి, యాకుమారీరత్నమును నేఁ గొని వత్తు" నని పలికి, రుక్మిణీ దేవివివాహముహూర్తము నడిగి తెలిసికొని, తనయు త్తరువు

వలన నుత్తరక్షణమున రథచోదకుఁ డగుదారుకుఁడు సైన్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకము లను దివ్యరథ్యములను బూన్చి తెచ్చినరథమును, కన్యామణిని రుక్మిణిని జేపట్టుమనో రథముతో, వాసుదేవుఁ డాసుదేవునితోడ నారోహించి, హుటాహుటిగ నొకేరాత్రిలో నానర్తక దేశములం గడచి విదర్భ దేశమునకు వచ్చుచుండెను.

---

## బలరామప్రయాణము.

నల్లనయ్య యొకబాఁపనయ్యను గూడి కుండినపుర మునకుఁ దరలిపోయె నని విని బలరాముఁడు "మనతమ్ముఁడొ యేకాకి యై యేగినాఁడు. అచ్చటికో శిశుపాలునిహితమును గోరి జరాసంధ దంతవక్త్ర సాల్వ విదూరక పౌండ్రకాది భూపాలు రెందఱో పోయియున్నవారు. కన్యాకాహరణసమయ మున రణము తప్పక యగును. ఖలవిదారి యగు కంసారికి సహాయపడవలయు" నని చతురంగబలసమన్వితుఁ డై, సాత్యకియును గదుఁడును వెంట రా, సరగ నరిగి కుండినపుర ప్రాంతముననే హరిని జేరికొనియెను.

---

## శిశుపాలాగమనము.

చైద్యుఁడు విదర్భునియొద్దనుండి వచ్చిన శుభలేఖను జూచి యానందవార్ధినిమగ్నుఁ డై "యౌఁ గాక. భోజ భూకాంతుఁడు బుద్ధిమంతుఁడు. కావుననే బాగుగ నాలోచించి సకలరాజకుమారులలో నగ్రగణ్యుఁడ నగు నాకు రుక్మిణి నియ్యం గోరె" నని మీసముపైఁ జేయి వైచి యొక్క

మాఱు నులిచి, తల యూఁచి, తత్క్షణమె సర్వభూషణాంబ
రాలంకృతుఁడై, శతాంగ మాతంగ తురంగ భటసంఘము
తోను, బంధుమిత్రపరివారవర్గముతోనుఁ బరమసంభ్రమము
తోఁ బయనమై వచ్చి, వివిధాలంకృతశోభితం బయి యున్న
కుండినపురీవరమును బ్రవేశించెను. విదర్భేశ్వరుఁడు నూతన
జామాత నెదుర్కొని చని పూజించి, యొక విడిదిలో విడి
యించెను.

## ఇతర దేశాధీశులు.

మఱియును, విదర్భభూధవునకు సుహృద్బాంధవు లగు
నంగ వంగ కళింగ కాంభోజ కర్నాట కరహాట లాట బర్బర
సింధు గాంధా రాభీర కాశ్మీర సౌవీర చేర ఘూర్జర కురు
కుంత లోత్కల కోసల పాంచాల సింహళ కేరళ మళయాళ
నేపాళ చోళ మద్ర మగధ నిషధ కరూశ కాశ కొంకణ
ఔంకణ దశార్ణ యవన పారసీక బాహ్లీక శక పాండ్య పుండ్ర
పుళింద గౌళ మాళవ సాళ్వ శూరసేన సౌరాష్ట్ర మహారాష్ట్ర
మత్స్య కేకయ హైహ యాంధ్ర ద్రవిడ విదే హానర్త
త్రిగర్త దేశాధీశు లందఱు రాజయోగ్యము లగు ఛత్ర
చామరాది చిహ్నములు చెలంగ, స్యందన భద్రవారణ పంచ
కల్యాణి భర్మయానాది నానా ఘన వాహనములపై మహా
వైభవముతోఁ జతురంగ సైన్యసమేతముగఁ జనుదెంచి విదర్భ
రాజేంద్రునివలన మర్యాదలు వడసి నిర్ణీతనివేశంబుల విడిసిరి.

## రాజభక్తి.

రాజపుత్త్రికిఁ బెండ్లి యని, సాహుకారులు తమవిక్ర యాంగణముల సక్రమముగ నలంకరణము కావించి పతాక లెత్తించిరి. గోడలకుఁ జిత్రపటములు పెక్కులు తగిల్చిరి. ద్వార పార్శ్వములందుఁ బూలచెట్లతొట్లమర్చిరి. మఱియుఁ, బం డుగుదినమునంబోలె నిల్లిల్లాలిచే నలుకఁబడి రంగు మీఱు రంగవల్లులు పెట్టఁబడియెను. గోడలు సున్నపుఁబూఁతలతో డను నెఱ్ఱమట్టిపూఁతలతోడను జిత్తరువులతోడను సొబగు మీఱుచుండెను. వాకిళ్లు పచ్చతోరణములచే నలంకరింపఁ బడి చెలువారుచుండెను. తలుపులు కంబములు కిటికీలు మంచి మంచిరంగులు పూయఁబడి రంగారుచుండెను. ఇట్లు ప్రతి గృహము లక్ష్మి తాండవ మాడుచుండునట్లు శోభాయమాన మై యుండెను. పౌరు లాబాలగోపాలము వారివారిపదవుల కొదవినయటులు సురుచిరాలంకృతు లయి పరమసంతోష మున మెలఁగుచుండిరి. ఆ మహాపట్టణమునకుఁ జుట్టుపట్టులఁ బెక్కుక్రోసులదూరమునుండి జానపదులు పెండ్లివేడుకఁ జూడఁ, దిరునాళ్లకుంబలెఁ దండోపతండములుగ సాగివచ్చుచుండిరి.

---

## రుక్మిణీమనోవ్యాకులము.

రుక్మి వనమాలిని జులుకఁజేసి శిశుపాలునికే చెల్లెలి నీయ నిశ్చయించినది మొదలు, రుక్మిణి మనమునఁ గదిరిన యింతంతనరాని వంతచే జలజల జాలువాఱెడు నశ్రుధారలఁ దుడుచుకొనకయుఁ—గొప్పు నొప్పుగఁ దుఱిమి పువ్వుల ముడుచు కొనకయు, నెచ్చెలులతో ముచ్చటలాడం జనకయు – భక్ష్య

భోజ్యములఁ దినకయుఁ, బానీయముఁ ద్రావకయు - వన
విహారమునకై పోవకయు, జలక్రీడలఁ జేయకయు - మల
యజముఁ బూయకయు, నిలువుటద్దములలో నందము చూచు
కొనకయుఁ - గాటుకయుఁ దిలకము నుంచుకొనకయు, వింత
వింతవలువలు గట్టకయు - విభూషణములను బెట్టకయు, జిలు
కలను ముద్దుగ మాట లాడింపకయు - గోరువంకపిట్టలను
బాడింపకయు, వీణ వాయింపకయు _ గానము సేయకయు,
వనజలోచనునిమోఁదివలపునం జిక్కి - మదన వేదనను స్రుక్కి
కాయము క్రమమునఁ గృశింప, నిట్టూర్పులు నిగుడ్చుచు నుస్సు
రస్సు రనుచు నవిరళముగఁ గళవళపడుచుండెను.

ఆచిన్నికృష్ణుని చెన్నారురూపమును గమనీయగుణగణ
మును నమానుషత్వమును లీలావినోదములను దలఁచితలఁచి
"యకటకటా! యిట్టియసమానసుందరునికి సుగుణసంపన్నునికి
లీలామానుషమూర్తికి శ్రీకృష్ణమూర్తికి న న్నీయఁ దలపెట్టక
నాయన్న పన్నినపన్నుగడకు నే మనవలయును! అక్కటకటా!
యక్కటికముమాని యక్కమలాసనుఁడు నే నిట్టియిక్కట్టునఁ
దగిలి పొగుల నొసట వ్రాయునే! హా! పరమేశ్వరా! నీకైన
దయ రాదా! భవానీదేవీ! భవత్కృపకుఁ బాత్రురాలను
గానా!" యని యార్తయై యిష్టదైవమును బ్రార్థించును.

పుట్టినది మొదలు దుఃఖ మనున దే యిట్టి దని యెఱుఁ
గని యాముగుద దుఃఖసముద్రమున మునిఁగిన దై, తన
మనోదుఃఖమును దల్లికిఁ గూడఁ దెలుపక లోలోనఁ గుము
లుచు, నొక్కచోటఁ గూర్చుండి, విన్నఁబోయినవదనంబు

వాంచి, చెక్కిటఁ జేయి గదియించి, బొట్టనవ్రేల నేల వ్రాయుచు, డోలాయమానమానస యై,

మ. ఘనుఁ డాభూసురుఁ డేగెనో నడుమ మార్గశ్రాంతుఁడై చిక్కెనో
విని కృష్ణుం డిది తప్పుగాఁ దలఁచెనో ♦ విచ్చేసెనో యీశ్వరుం
డనుకూలింపఁ దలంచునో తలఁపఁడో ♦ యార్యామహాదేవియున్
నను రక్షింప నెఱుంగునో యెఱుఁగదో ♦ నాభాగ్య మె ట్లున్నదో!

(భాగవతము)

“బ్రాహ్మణోత్తముఁడు ద్వారక చేరెనో! లేక మార్గ మధ్యముననే బడలికఁ జెంది నిలిచెనో! ఒకవేళ హరియే యిది యొప్పనిపని యని నిరాకరించెనో! ఈశ్వరాజ్ఞ యెటు లున్నదో! లోకమాత యగు నగజాతకు నావలనఁ గృప యున్నదో లేదోకో! తుదకు నాయదృష్ట మెఱుంగరాదు గదా!” యని పలుదెఱంగుల నాలోచించును. కొంతసేపటికిఁ దటుకున లేచి, కిటికీలయొద్ద నిలిచి, గుజ్జరాతి తెరువుదిక్కు మొగం బయి దృష్టి సారించి చూచును. పలుపులుఁగు లిటు నటు శరవేగముగఁ దిరుగులాడుట యగపడునే కాని రథము వచ్చుట కానరాదు. పాపము! రుక్మిణి యెంతసేపు నిలుచును! ఎట్టకేని విసిగి పట్టరాని మనఃఖేదమున విరిశయ్యపైని బరుండఁ బోవును. మురళీగానవిలోలునివలనివిరాళివలన నాయరాళ కుంతల కా విరులు ములుకులపోలిక గ్రుచ్చుకొనఁగాఁ దాళఁజాలక యొకహంసతూలికాతల్పమునఁ బరుండును. నిదుర పట్టక యిటు నటుఁ బొరలుచునే ‘యిదిగో! విందు నుక్తి యిది గోవిందునుకి’ యని కలవరించి, లేచి కూరుచుండి,

బయ లాలకించును. ఇట్టి విరహవిభ్రాంతులను జూచి, యా చెలియింగితము నెఱింగినవారు కావునఁ, జెలికత్తియలు పరితపించి, యామెకు హితవచనములు పలుకుచు, నుపచారములఁ జేయుచుండిరి.

---

సోది.

అట్టి సమయమున నొక కొరవంజి బండిగురిగింజల దండలు పాలపూసలపేరులు సంకుపూసలసరులు మెడనిండ సందడింప, మనికట్లపై గాజువలయములు గలగల లాడఁ, గాలికంచుమట్టియలు ధ్వనింప, వ్రేళులఁ బొంకముగఁ బెట్టఁబడిన సంకుటుంగరములతోను, బింగాణియుంగరములతోను, జెవితమ్మెలఁ బెట్టి యున్న చెవ్వాకుచుట్టలతోను, నుదుటఁ బట్టు వైచినట్టు పూసిన కుంకుముబొట్టుతోను, జేమంతిపూలు గీలించిన గొప్పకొప్పుతోను, మొలయందుఁ జెరివిన సంబెళతోను, దలపైని బెట్టిన బియ్యపుగంపబరువుచేతను వీఁపున నంటఁగట్టిన శిశువుబరువుచేతను నుదుటుంగుబ్బలబరువుచేతను లేనడు మసియాడఁ, బేరుటెలుంగున 'నెఱుక యెఱుకో' యని కూయుచు, నెడనెడను వక్కాకెంగిలిని దుపుక్కున నూయుచు, వీథిని జనుదెంచుచుండెను.

ఆకూఁత విని చెలిమికత్తెలు రుక్మిణిని జూచి "యల్లదె! సోదెకత్తె వచ్చునటు లున్నది. దాని నిటకుఁ బిలుచుకొని వచ్చెదము. నీవు సోదె చెప్పించుకొను మమ్మా" యనిరి. అందులకు రుక్మిణి "చెలులారా! వనమాలి రావలయును నాకుఁ గల మనోవ్యథ తీఱ వలయును. తదితరమువలన

నామనోవిచారము తీఱునా! అయిన, మీ హితవచనము నే నేల త్రోసిపుచ్చవలయును? తోడుకొని రం''డని పను చుటయు, వారును వే చని, యావనవనితను రుక్మిణికడకుఁ దోడ్కొని వచ్చిరి.

రుక్మిణి దానిని జూచి ''కొరవంజీ! మంచిబహుమతి యిచ్చెదను. నాకు గద్దె బాగుగఁ జెప్పవలయును జుమా'' యని దోసెఁడు హురుముంజిముత్యాల నొక పళ్లెరమునఁ దెప్పించెను. అది గైకొని యాయెఱుకసాని కేలఁ గలిపి, మూఁడుపాళ్లు పెట్టి, నడిమిరాసియందుఁ జూడ్కి నిలిపి, చేతు లెత్తి జోహారు చేసి, కాళికాదిశక్తులను బేర్కొని, తనబెత్త మును నాయతివను బట్టుకొన నిచ్చి, వారియింటి పేరంటాలు వచ్చి చెప్పినట్లుగా నిట్లనియె:—''అవ్వోయవ్వ! నీకోరిక త్వరలో నెఱవేఱఁగలదఁట. కోరినకోరిక యేమంటివా, చెప్పెద వినవే తల్లీ! బుజము చూపఁ దోడఁబుట్టు, బొడ్డు చూపఁ గొడుకు, బొట్టు చూప మగఁడు, గడ్డము చూప మగవాఁడు, కమ్మ చూప ఆఁడు దందురే. కండ చూప బందుగు లందురే. అవ్వోయవ్వ! కల్ల గాదు, నవ్వు గాదు. నీవు తలఁచినతలఁపు కండ గాదు, కమ్మ గాదు గడ్డముగాదు, బొడ్డు గాదు, బుజముగాదు. నీవు బొట్టు గోరి పొత్తు గోరి పొందు గోరి యడిగితివే తల్లీ! ఇదిగో నిటుమూల పడమటి మూలనుండి నీకు మగఁడు వచ్చునే యమ్మా! వాఁడు నల్లని వాఁ డంట. అందగాఁ డంట. వీరుఁ డంట యమ్మా! త్వర లోనే వచ్చి నిన్నుఁ బెండ్లాడునే తల్లీ!'' యని యెఱుక చెప్పి,

బహుమతి యంది, యామెయుకతి పెనులిబ్బి యబ్బినపేద చందమునఁ బెల్లుబ్బుచుఁ దనదారిని దాఁ బోయెను.

## రుక్మిణీవిరహము.

అంత నెచ్చెలులు మచ్చిక మీఱ విదర్భరాజతనయను జూచి "యమ్మా! నీనోములు పండెను. జగదంబకృపవలన నీ కోర్కె కొదవయు నొదవదు. మా మాటల నమ్ము" మని యోదార్చుచు, నుచితరీతుల నామెకు నుపచరించు చుండిరి. అయిన నా యంగనామణి యనంగశర పరంపరాగ్నికీలలచే వేఁగుచు, దిన మొక్క యేఁడుగఁ గడపుచుఁ గృశీభూత యగుచుండెను. ఆమె యుంగరములుఁ గరకంకణములు నొడ్డాణమును వదు లయ్యెను. రేవెలుఁగు వేవెలుంగయ్యెను. మందమారుతము మఱింత మంటలు గొలుపుచుండెను. పులుఁగుల యెలుంగులు ములుకులువోలె నాటుటచేఁ జెవులు తూంట్లువోవున ట్లుండెను. స్మరజ్వరముచే నందమైనమేను కందిపోవుచుండెను. ఒకొకప్పు డాకోమలి సొమ్మసిలును. అత్తఱిఁ జెలికత్తియలు తత్తఱ మొంది యాబిత్తరికి శైత్యోపచారములు చేయుదురు; దృష్టి తీయుదురు.

ఈ ప్రకారము కతిపయదినములు కడచనెను. పెండ్లి దినము సమీపించెను. శిశుపాలుఁడు వచ్చియున్నాఁడు. తక్కినరాజులు వచ్చియున్నారు. రాజగోపాలుఁడు రాఁడాయెను. ఱేపే వివాహముహూర్తము. రుక్మిణీదేవి జీవిత

మునం దిచ్ఛ లేకుండెను. "ఇం కెక్కడఁ గృష్ణుఁడు వచ్చుట? నే నెక్కడఁ బెండ్లిచేసికొనుట ? నా ప్రయత్నము నిష్ప్రయోజన మయ్యెను! నాకోరిక గొంతెమకోరిక యయ్యెను! అందరానిపండున కాశించిన ట్లయ్యెను! ఇఁక మేనఁ బ్రాణములు పెట్టుకొని యుండిన, రుక్మి శిశుపాలునకు నన్నిచ్చి పెండ్లి సేయువాఁడు. కావున నే బ్రదికి యుండుట తగ"దని యామె ప్రాణత్యాగమునకు సాహసించెను. అప్పుడు దైవానుగ్రహముచేఁ బరమశుభసూచకముగ నాశుభాంగికి నెడమకన్ను నెడమబుజము నెడమతొడయు నేకకాలమున నదరెను. సకలశాస్త్రములు తెలిసినట్టిది కావున, రుక్మిణి తనకు మేలు కలుగునని గ్రహించి, ప్రాణత్యాగప్రయత్నమును మానుకొనెను.

---

## బ్రాహ్మణసమాగమము.

కొంతసేపటికి, మేడమెట్లపయినుండి టక్కు టక్కుమని పావకోళ్లధ్వని వినవయ్యెను. ఆసడి విని రుక్మిణి బ్రాహ్మణుఁడు వచ్చుచున్నాఁడని యెఱింగి గునగునఁ బఱతెంచి, యాతని కెదురేగి, యాతనిసంభ్రమమును ముఖవికాసమును గనుఁగొని, ధైర్యము వహించి, యాతురతతోఁ "బండా? కాయా?" యని యడిగెను. "పండు! పండు! నీనోము పండెనమ్మా! దామోదరుఁడు వచ్చెనమ్మా!" యని విప్రవర్యుఁడు ప్రత్యుత్తర మిచ్చి తాఁ బోయి వచ్చినవృత్తాంతమును సవిస్తరముగ రుక్మిణికిఁ దెలియఁజెప్పెను. రుక్మిణీదేవి యానందసాగరమున మునింగెను. ఆమె కొంతసేపు మాట

లాడ లేకుండెను. బాష్పబిందువులు చెక్కుటద్దములపైఁ దెలి ముత్తియములభంగి దొర్లిపోవుచుండెను. ఆమె కరకమల ములు ముకుళించెను. "నాతండ్రీ! తొలుత, సీతాదేవికి శ్రీరామచంద్రసమాగమమును గూర్చిన శుభసందేశమును దెలిపి ప్రాణములు నిలిపినవాయునందనునింబోలె, విప్రకుల నందనుండ వగు నీవు యదువంశాబ్ధిచంద్రుని సమాగమ మును దెలిపి నాజీవముల నిలువంబెట్టితివి! అప్తుఁడనిన నీవే కదా యాప్తుఁడవు! 'ఆపదలందు బంధువులు సైతి మొగ గరు. స్నేహితు లాదగుదు' రని నీతికోవిదులు వచించునది యిప్పట్టున నొప్పయ్యెను. ఇట్టి మహోపకారికిఁ బరోపకార పారీణునికి స్వార్థపరిత్యాగికి నే నేమి ప్రత్యుపకారము సేయ నోపుదును? మహానుభావా! విప్రకులాగ్రణీ! సద్బంధుచింతా మణీ! యిదె నానమస్కారము గైకొను" మని యాతని పదమ్ములకుఁ బ్రణమిల్లెను. "పరమకల్యాణ మస్తు! సర్వా భీష్టసిద్ధి రస్తు! సమస్తసన్మంగళాని సన్తు!"-అని యాశీర్వ దించి విప్రుండామెను వీడ్కొనెను.

---

## బలరామకృష్ణులు.

అంత, బలరాముఁడును రాజగోపాలుఁడును గుండిన రాజధానీరాజవీథియందు యాదవ వాహినీ పరివృతు లయి మహావైభవముతో వచ్చుచుండిరి. సౌధవీథులఁ బౌరాంగ నలు నిండి వేడుక చూచుచుండిరి. మొదట నరదములు, నరదములవెంబడి ద్విరదములును, వానివెంటఁ దురగము

లును సాగినవి. వానివెనుకను గాలిబంటులు చాలువులు దీరి నడచిపోయిరి. పిమ్మటఁ దాళాంకునిరథమును గరుడధ్వజునిరథమును సాత్యకిరథమును గదునిరథమును వచ్చుచుండెను. అప్పుడు, మదనగోపాలునిఁ జూచుటయందుఁ గౌతూహలయుతలై యిందుముఖు లొండొక ర్తుకలు త్రోపులాడుకొనుచుండిరి. వారిలోఁ గొందఱు మదనతులు బలహీనలను ద్రోచివైచి తాము ముందునకుఁ బోయి నిలువంబడిరి. ఒక ప్రౌఢ వేఱొకతెను జూచి మంచితనముగ "అమ్మా! మన మిరువుర మావైపునకుఁ బోయి బాగుగఁ జూచెదము రమ్మా" యని యాకొమ్మను దోడ్కొనిపోవునటులు నటించి తటుకున నామెస్థానమును దా నాక్రమించుకొని పకపక నగును. అంత, నేమఱినయాయువది "ఔనే! యెంత నేర్చినదానవే! నెఱజాణ యన్నిన నీకే తగునే!" యని యాడికొనుచు వేఱొకయెడకుఁ బోయి నిలువంబడును. ఒకపొలఁతి యొండొకతెను జేరి "ఏమమ్మా, నీపసిబిడ్డఁడు గొంతుక బొంగుపోవ నేడ్చుచుండఁ దిరిగికూడఁ జూడవు. 'నే నెత్తుకొనియెదను ర' మ్మనిన, రాఁడు. నీవైనఁ బోయి వాని నెత్తుకొని రావమ్మా" యని తన కెక్కడ లేని పరితాపము కలిగినటు లనుకరించి యాలేమను బంపి, యాయెడము తనకు లభించినందులకుఁ గడు సంతసించును. ఒకదిట్ట ముందున్న వారిని గొంతకొంతగనే నెట్టుచు, "ఎవ రమ్మా యిట్లు త్రోయువా" రని యడిగినవారికి "నేఁ ద్రోయుదునా? వెనుక నుండువారు త్రోయుచున్నారు. నే నేమి చేయుదు

నమ్మలారా!" యని సమాధానము చెప్పుచునే ముంపునకు జరగుచుండెను. ఇట్లు లాపాలఁతుకలు పలువురు పలుపోకలం బోవుచుండు సమయమున, బలరాముని రథము వచ్చెను. అమ్మలక్కలు గుసగుసలు వోవసాగిరి.—"నీలచేలములు ధరించిన యీబంగారుమేనివాఁ డెవ్వఁడే?" యని యొకతె యడుగును. "ఇతఁడే బలరాముఁడు; రోహిణీదేవికుమారుఁడు; రేవతిమగఁ" డని మఱియొకతె చెప్పెను. చెలీ! ఆరథములో నాఁగలి యొకటి, రోఁకలి యొకటి యున్నవి! అవి యెందులకే?" యని యొక తొయ్యలి యడుగును. "అయ్యవి బలరాముని మాయుధములు. ఇతఁడు వీనిని బూని కయ్యమునకు దిగెనా, శత్రువులు పిండిపిండి యగుదు రఁటమ్మా!" యని యొండొకతె కొండాడును.

వెంటనే, తొగలరాయనిఁ బోలు సొగసుమొగంబువాని, జిగిబిగినగవులు మొగమున వెలయువాని, నౌదల శిఖిపింఛము ధగధగ మెఱయువాని, సిస్తుగ దిద్దిన కస్తూరితిలకము నుదుటను దులకించువాని, నూనూఁగుమీసలు మిసమిస మెఱయువానిఁ, జిన్నారిపొన్నారిలేజవ్వనమునఁ దనరువానిఁ, జెలువారు చామనిచాయమేనివాని, నొల్లెవాటు వైచిన దివ్యపీతాంబరమువాని, గొల్లమిటారుల మానధనమును గొల్లగొనినవానిఁ, గనులారఁ గనుంగొనినయంతనే, యమృతకరుని కిరణములకుఁ జంద్రకాంతమణులు కరఁగుకరణి, నా శ్యామసుందరునికటాక్షవీక్షణములకుఁ బౌరకాంతామణుల హృదయములు కరఁగిపోయెను.

అప్పు డొకపూఁబోఁడి "యితఁ డటే యల్లవ్రేపల్లె లోనిగొల్లపిల్లల వలపించిన కోడెకాఁ?" డని వేఱొకకోమలి నడుగును. అందుల కామె "యవునే. వీఁడె యావల్లవపల్లవాధరలముంగొంగుబంగార" మని పలుకును. ఒండొకకలికి "చెలీ! వీఁడటే బృందావనమున గోపకామినీబృందమును గూడి రాసక్రీడ యొనర్చినప్రౌఢుఁడు?"—అని మఱియొక మత్తకాశినిని బ్రశ్నించును. "అగునగును. ఆహా! యీసుందరాకారుఁ డీబృందావనమున వేణువు నూఁదునపుడు గొల్ల యిల్లాం డ్రెక్కడిపని సక్కడ వదలి యిలు వెడలి, యితఁడు పసులఁ గాచుచుండు నెడకుఁ బరువిడి పోయి, యాహ్లాదజనకమయ్యెడి యానాదమున కానందమగ్నలై యట్టె మైమఱచి పోవుదురఁట! ఎంతటి ధన్యాత్మలే! తొల్లి వా రెట్టినోములు నోఁచిరో కదా!" యని ప్రశంసించి మఱిగేమో చెప్పఁబోవునంతలో, వేఱొకయింతి "యింతియే కాదు సుమీ. ఆయావులు దూడలు నట్టు లెత్తి చెవులు ఱిక్కించి తోఁకలు పైకెత్తుకొని, యానాదము నాలకించుచు నిశ్చలత నొందునఁట! ఆహా! యవి యెంతపుణ్యము చేసికొనెనో యమ్మలారా!" యని యానందబాష్పములు విడుచును. ప్రక్క నున్న మఱియొకవనిత "యమ్మలారా! యంతటితోఁ బోయెనా—యావనమునందలి చెట్లు చేమలు పుట్టలు పురుగులు గుట్టలు గుల్మలతాదు లానందమగ్న మగునఁట! పక్షులు సొక్కి నిదుర పోవునఁట! పాములు పుట్టలపైకి వచ్చి పడగలు విప్పి యాడునఁట! మ్రోడులు చిగుర్చునఁట! శిలలు కరఁగు

నఁట! అమ్మకచెల్ల! వీనిలో నొక్కటినై నేఁ బుట్టరాదే." యని సంతాపము నొందును.

ఒక చిన్నెలాఁడి వేఱొకచిగురుఁబోఁడిని జూచి "మందహాసరుచులతో విలసిల్లు సుందరముఖమండలముతోను గంభీరవపుశ్రీవితోను నొప్పు నీ భువనమోహనునిఁ గాంచితే!" యనును. అందుల కాచిన్నది "అక్కా! యీవేణుగానలోలునిఁ గన వేయికనులు గావలయును! ఈకన్నులు చాలునటే!" యని నొక్కి పలుకును. ఒకతరుణి వేఱొకరమణిం గని "అక్కా! యల్లదె! చూచితే! యాతనిచేతియందుఁ గోటిసూర్యప్రకాశముగా గుండ్రనివస్తు వొకటి గోచరించుచున్నది. అది యేమొ?" యని యడుగును. "తెలియదటే చెలియా! యయ్యది చక్రాయుధమే. ఈ వెన్నుని యైదుకైదువులలో నిది మొదటిది కదటే. ఇది యపూర్వము మకరిని ద్రుంచి కరిని గాచినయది! ఈ చక్రమే, భగవద్భక్తి సామ్రాజ్య చక్రవర్తి యైన యంబరీషచక్రవర్తిమీఁదికి దుర్వాసమహర్షి పంపినకృత్యను జంపి యంతటితోఁ దృప్తి నొందలేక యామహర్షిని దఱిమి తఱిమి యారాజర్షి నే శరణుఁ జెందించినమహాచక్రము. మఱియు మహావిష్ణువు జగన్మోహినీవేషముతో దేవతలకు సమృతమును బంచుసమయమునఁ గుహనావేషమునఁ బీయూషమును గ్రహించి, క్రోలనుంకించిన రాహుకేతువుల కంఠముల ఛేదించిన సుదర్శనమిదియే" యని పదింబదిగఁ బ్రస్తుతించెను.

ఒక యిందువదన యా నందనందనుని వామకరార

విందమున వెలయు సుందర మగు చిందమును జూచి, యొం డొకకుందరదనను "సఖీ! యదిగో చూడుము. కళంకము లేని చంద్రబింబమువోలె ముద్దులు గులుకుచు నొక తెల్లని వస్తువు వెలయుచున్నదే, యది యేమె?" యని యడుగును. "చెలియా! యయ్యది పాంచజన్య మను పావనశంఖము కదవే! ఈయసహాయశూరుఁ డొక్కసారి దానిని బూరించెనా, 'కృతకభం కృతకభ' మ్మను నీశంఖనినాద మరిగర్భ నిర్భేదముగ నుండునఁట!

ఒకచిలుకలకొలికి మఱియొకకలికితోఁ "జెలీ! కనులు మిఱుమిట్లు గొనునట్లు ధగధగదీధితులచే నాతనివిశాలవక్షః స్థలమునందు మెఱయుచుండునది యేమె?" యని యడుగును. "చెలియా! యది కౌస్తుభ మనఁబడు మణి సుమీ. ఈకౌస్తుభమణి సముద్రమథనకాలమున విష్ణుమూర్తికిఁ బ్రాప్తించిన దఁట. ఆవిష్ణుమూర్తియే యీకృష్ణమూర్తి కావున నియ్యది యీతనిచెంతఁ జేరినది" యని యాచెలియ తెలియం బలికెను.

ఈలీల ముచ్చటలాడుచు, నాపువ్వుఁబోఁడులు పువ్విలు తునికోల్తలకుఁ జలించుచు, వనమాలిపైఁ బువ్వులఁ జల్లుచు, "నీచిన్నికృష్ణునికి మనచిన్నారిరుక్మిణిని గూర్చినచోఁ జతురాననుఁడు చతురుఁడే యనఁదగునమ్మ! మనపుణ్యావశమ్మున నీ నందకుమారుఁడే నవనీతచోరుఁడే నవమోహనాకారుఁడే రుక్మిణీరమణిని బెండ్లియాడును గాక!" యని దీవించిరి.

అంత, యదుపుంగవు లగు నాబలరామకృష్ణు లారాజ

వీథిని గడచిపోవులెఱని, విదర్భుఁడు రామకృష్ణులు తనకూఁతు
వివాహమున కేతెంచుట విని, వాద్యఘోషములతో నెదు
ర్కొని, వారిని యథావిధిని బూజించి, మధుపర్కము లిచ్చి,
చీనిచీనాంబరాది నానావిధోపహారముల నొసంగి, వారికిని
వారి పరిజనమునకునుఁ జతురంగసైన్యమునకును నుచితనివేశ
ములను గల్పించి విడియించెను. మఱియు జనులు వేన
వేలై లక్షోపలక్షలై కోటానఁగోటులై యిసుక వేసిన నేల
రాలనియట్లు క్రిక్కిఱిసి కిటకిట లాడుచుండిరి. కరిబృంహిత
ములును హరిహేషితములును బ్రజాభాషితములును దూర్య
ఘోషితములును భాసిల్లుచు, సముద్రము ఘూర్ణిల్లునటు
లుండెను.

అంతట, ముహూర్తలగ్న మాసన్న మగుటచే భీష్మక
రాజేంద్రుఁడు తనదుకుమారికి మంగళస్నానాలంకారములు
కావింప, సైరంధ్రీజనము నాజ్ఞాపించెను. వారు నాపురం
ధ్రీమతల్లిని జంద్రశాలకుఁ దోడ్కొని పోయి సంపెంగ
నూనె తలయంటి, పన్నీట జలకమార్చి, చలువరవసెల్లాలతో
బంగారుమేనితీవ కందకుండునటులు మెత్తమెత్తనఁ దుడిచి,
ధగద్ధగాయమానకాంతు లీనునట్టి యనర్ఘచీనిచీనాంబర
మును గట్టిరి. వెంటనె యాకనకాంగి నొకకనకాసనమునఁ
గూర్చుండఁబెట్టి, కురులు దడి యార్చి చిక్కుడలించి యగరు
ధూపము వైచి, యంతలో నాసుకుమారగాత్రకు నాయాస
ముచేఁ జిఱుచెమ్మటలు గ్రమ్ముటయు, నిరువురుసైరంధ్రు
లిరుగెలంకుల నిలిచి సురటులతో నల్లన విసరుచుండిరి. తక్కిన

సైరంధ్రు లా సర్వాంగసుందరిని సర్వాలంకృతశోభితను జేసిరి; మఱియు నా కాంతాతిలకమునకు నుదుటను గస్తూరీ తిలకమును సిస్తుగ దిద్దిరి.

## కులదేవయాత్ర.

తదనంతరము, భోజరాజన్యకన్య పర్వతరాజకన్యకు మ్రొక్క నగరు వెలువడియెను. పురోభాగమున వివిధాయుధ ధారు లైన వీరభటు లార్భటులు సేయుచుఁ బిలపిల మూఁగు పజల నవలఁ దొలఁగఁజేయుచు నరుగ, భేరీ మృదంగ ఢక్కా హుడుక్కా పటహ కాహళ మురళీ నినాదములు రోదోంత రాళములు నిండ, భూసురాంగనలు మంగళగీతములు పాడ, వారాంగనలు భరతనాట్య మాడ, సూతవందిమాగధకవి గాయకులు కై వారములుసేయ, శ్రీకృష్ణచరణకమలై కసంస్మర ణముతోఁ జెలిక త్తియలనడుమ నాయంచయాన యలక లల్ల లాడఁ, లేఁగా నసియాడ, గుచ్చెళ్లు జీరాడ నల్లల్లన నడచి పోయి, భవానీభవనమును జేరి, పాదప్రక్షాళనాచమనము లాచరించి, శుచిర్భూత యై భూతేశు నిల్లాలి సన్నిధాన మునకుం జనియెను. అంతట, బ్రాహ్మణపుణ్యాంగన లంబికా త్ర్యంబకులకు నభిషేకంబు గావించి, గంధపుష్పాక్షత లిడి, యమూల్యవస్త్రాభరణమాల్యాలంకృతు లొనరించి, ధూప దీప నై వేద్యములు సమర్పించి, వివిధోపహారము లొసంగి, మంగళహారతి యిచ్చి, రుక్మిణీదేవిని మ్రొక్కించిరి. అప్పు డా పరమకల్యాణి పార్వతీపరమేశ్వరుల ని ట్లని సంస్తుతించెను:

ఉ. నమ్మితి నా మనంబున సనాతను లైన యుమామహేశులన్
మిమ్ముఁ బురాణదంపతుల మేలు భజింతుఁ గదమ్మ మేటి పె
ద్దమ్మ! దయాంబురాశివి గదమ్మ హరిం బతిఁ జేయుమమ్మ ని
న్నమ్మినవారి కెన్నఁటికి నాశము లేదు గదమ్మ యీశ్వరీ!

(భాగవతము)

అని రుక్మిణి ప్రార్థించి, భవసమేత యగు భవానికి మ్రొక్కి, పతులతోడం గూడిన విప్రసతులకు మూసివాయన ముల నుపాయనములుగా నొసంగి వారలం బూజించి నమస్క రించెను. వారు పరమాహ్లాదముతో నాశీర్వదించి పెండ్లి కూఁతుశిరమునందు సేస లిడిరి. సేసఁబ్రాలు శిరసున వహించి యాజవరాలు శివునిల్లాలికి మరలఁ బ్రణమిల్లి, గుడి వెడలెను.

ఇట్లు క్రొక్కారుమెఱుంగు తెఱంగునఁ దుఱంగలిం చుచు, సుమబాణుఁడు విడిచిన సమ్మోహనాస్త్రమో యన, జగన్మోహిని యై యారమణీమణి విలువ గల పలువగల క్రొన్నగల నిగన్నిగలు వ్యాపింప, మన్ననల్ వడయు క్రొన్న నల సువాసనల గుమగుమలు గుబాళింపఁ, గాలియందియలు గల్లుగల్లు మని మనోహరధ్వని యొనరింప, మనస్సంజాత కేత నమో యన మలయానిలమునకుఁ జేలాంచలము సంచలింప, బారులు దీరి నిలిచియుండు రాజకుమారులలో రాజీవలోచనుఁ డున్నాఁడా యని మారునితూపులం బోలు నోరచూపులు సారించి చూచుచు, సుందరమందగమనంబునఁ జనుదెంచు చుండెను.

అప్పుడు రాజనందనులా యిందువదనను సుందరద
నను మందగమనను గనులారఁ గనుంగొని, కందర్పశరపరం
పరాసంతప్తులై "యహూరె! యేమి యీ యొయ్యారి
చెలువము! రంభోర్వశీమేనకాదులైన నీరంభోరునకు సాటి
వత్తురే! ఈకమలాననను సృజియించిన యాకమలాసనుని
సామర్థ్యము నేమని కొనియాడనేర్తు" మని యాయుప
రేందిరరూపలావణ్యమునకు నాశ్చర్యపడుచు, ఱెప్ప లార్పక
చూచుచుండిరి. అంత వారి చిత్తములు చిత్తజాయత్తము
లయ్యెను. మహామేరువుంబోని వారిధైర్యము రూపుమాసెను.
హిమాద్రిని బోలువారిస్థైర్య మడుగంటెను. వారి గాంభీ
ర్యము సముద్రమున డాఁగెను. వారిగౌరవము గంగఁ
గలసెను. వారియెఱుక లెఱకలు వచ్చి యెటకో యెగిరి
పోయెను. వారియాయుధములు నేలపా లయ్యెను. అట్లు
భ్రమించి నిలిచియున్న రాజలోకమున—నొకరాసుతుండు
కేసుగుడ్డలో మీస లొత్తెను. ఒక రాజసూనుఁడు మీస
ముల మెలివెట్టెను. ఒకరాజపుత్త్రుఁ డుత్తరీయము నొల్లె
వాటు వైచెను. ఒకరాజనందనుఁడు చెంగావిరుమాలు
చెంగులు దిద్దెను. ఒకరాజకుమారుఁడు రత్నకుండలముల
నెగఁద్రోసెను. ఒకరాజతనయుఁడు కలికితురాయిని జక్క
నొత్తెను. ఒకనృపకుమారుఁ డుంగరములు పొంకపఱిచెను.
ఒక రాచకొమరుఁడు రానియావులింతను దెచ్చుకొని ఒమ్ము
విఱుచుకొనెను. ఇటు లా రాజసుతులు జగజంత యగు భగ

వంతునిమాయకు లోఁకువ యయి తేఁకువ చెడి, జంత్రగాని కీలుబొమ్మలపగిది నిలువంబడి యుండిరి.

అట్లు మనోహారిణి యై, పాదచారిణి యై శ్రీకృష్ణసం దర్శనాభిలాషిణి యై వచ్చుచున్నయాయింతి మరునిపూబంతి సొగసులదొంతి యొక్కయెడ నగుమోము గలవాని, నిడుద చేతులవాని, వెడఁదవక్షమువానిఁ, జేరెఁడేసి కన్నులవానిఁ, బస మీఱు పసిఁడిపచ్చడమువాని, మబ్బురంగుల హొరంగు మేనివానిఁ, జక్కనయ్యను మించిన చక్కఁదనంబువానిఁగను లారఁ గనుంగొని, గగురుపొంది, యతని మైయొఱపునకు మదిని మెచ్చి, హెచ్చినసంతోషముతో సుందరదరహాస లజ్జావలోకనముల నిగిడించెను. ఒండొరులచూపులు కలసెను. వెలలేనిచూపులై వెలసెను. అవి కంతుని తులలేనితూపులై హృదయముల భేదించెను. మఱియును శ్రీకృష్ణునిసందర్శ నము రుక్మిణీదేవినయనచాతకములకు సుశోభితనీలజీమూతా గమం బయ్యెను. ఆ నయనచాతకము లాతనియపారకృపా రసమును గ్రోలి యమందానందమును జెందెను. ఈవిధమున నాకమలదళేక్షణ నిజకటాక్షవీక్షణముల నవమదనునింబోలెఁ దులకించు నయ్యదుకులతిలకునిఁ దిలకించి పులకించి కిలికించిత ములు వెలయ నలకలఁ దొలఁగఁ ద్రోయు వ్యాజంబున నాతని కవ్యాజభక్తితో జోహారు చేయురీతిగనుఁ, దనకక్ష ములక్రింద నాతఁడు చేతు లిడి తీసికొనిపోవుటకు ననుకూలత కలిగించురీతిగనుఁ దనచేదోయి పైకెత్తెను.

అంత, నాహృషీకేశుం డది యెఱింగి, మేరుపర్వత గహ్వరమునుండి సింహము క్రిందికి వడి దుముకుకై వడి నాపురుషసింహుఁడు బంగారు తేరినుండి నేలమీఁదికి నుఱికి, హొంబట్టుపుట్టము జీరాడ హొయలునడతో వచ్చి, రాజ లోకము నొకలెక్కకుం గొనక రాజన్యకన్యను సమీపించి నపు డొక చమత్కారపుమాయ పన్నెను. 'ఇచ్ఛామాత్రం ప్రభో స్సృష్టిః' అనునటు లాకృష్ణభగవానుని సంకల్పమువలన నిజదేహనీలచ్ఛాయలు మేఘము లావరించినటులు సూర్యుని మఱుఁగుపఱిచెను. అంతె నాజనసమూహమున నొక కల కలము కలిగెను. "ఆహాహా! ఏ మిది? యాకస్మికముగ మబ్బులు క్రమ్ముచున్నవి. 'వర్షము సంపద ప్రసవము కురియుట వచ్చుట యగుట యాకస్మికసంభవము' లనెడిలోకోక్తికి నిది యొకతార్కాణ మయ్యె!" నని యాశ్చర్యపడుచుండునంతలో నా కనకాంగిని గడువడి నెత్తుకొని పోయినపు డామెమైఁదీఁగ మెఱపుఁదీఁగపగిది నండలి జనుల కనులు మిఱుమిట్లు గొను నట్లు తళుక్కున మెఱచెను. అందుల "కబ్బా! యిది యేమి మెఱపు! కనులు చెదరుచున్నవి" యని క్రన్ననఁ గన్నులు మూసికొనిరి. మఱియును విష్ణుపదమునుండి జిష్ణ్వాది దేవ తలు కృష్ణదేవునిశీర్షముపైఁ బుష్పవర్షమును బరమహర్ష మునఁ గురియుఁగా, నా దివ్యకుసుమము లాకాశగంగాజల సిక్తము లై యుండుటంజేసి యవి జనులకంచుకములపైఁ బలపల రాలినపుడు, వారు వాన కురియుచున్న దని తలంచిరి. ఇంతలో నాలోకైకవీరుఁడు రుక్మిణీదేవిని రథారోహణము

సేయుంచి, పాంచజన్యము నెత్తి విజయసూచకముగా 'భంభం భంభ' మ్మని దిక్కులు పిక్కటిల్లునటు లొక్కసారి పూరించెను. ఎల్లవారును జెవు లప్పళించి "యప్పప్ప! యీావర్షము నకుఁ బిడుగు కూడఁ బడినది!" యని కనులు మఱింతగట్టిగ మూసికొనిరి. అరదము దడదడమని పోవుటను మేఘ ముఱిమిన దని జనులు భావించిరి. అంతఁ బుష్పవర్షపతనము నిల్చుటను వాన నిలిచె నని యెంచి జనులు కనులువిచ్చి చూచిరి. అంతయు హుళిక్కి యయ్యెను! రుక్మిణీదేవి కానరాదయ్యెను! అంత హాహాకారములు చెలరేఁగెను. "రుక్మిణీదేవి యెక్కడ? రుక్మిణీదేవి యెక్కడ?" నని జరాసంధాదు లాజనసందోహమున వెదకసాగిరి; నలుగడలఁ జూపుమేరదూరము తేఱి చూచిరి: ఘూర్జరమార్గమున నొకరథము పోవుచుండుట్లను గాంచిరి. ఆస్యందనమున నున్న శాతోదరి రుక్మిసహోదరియ కా నిశ్చయుంచిరి.

## యుద్ధము.

అంతట, శిశుపాల దంతవక్త్ర సాల్వ విదూరక పౌండ్రకవాసుదేవ కాలయవన జరాసంధాది దుస్సంధు లగు పరిపంథిరాజవీరులు క్రోధారుణాక్షు లై హుంకరించిరి. "ఆహాహా! ఏమఱితిమి కదా! అల్లగొల్లముచ్చు వచ్చి మటుమాయ పన్ని మనల నెల్ల నేమఱించి పెండ్లికూఁతుఁ గొంపోవుచున్నాఁడు. యాదవులు వెంటఁ బోవుచున్నారు. ఇప్పుడు లేని పరాక్రమము మఱి యెన్నఁటికి? మనయస్త్రశస్త్రములు తగులఁబెట్టనా? ఇందఱుశూరు లుండి యాకన్యామణిని విడి

పింపనియెడ లోకులు నవ్వి చప్పటలు గొట్టరే!" యని రోస
ముతో మీసములు ముడుచుకుచుఁ గవచములు దొడిగి ధను
ర్బాణములు ధరియించి తమతమచతురంగబలములఁ గూడి,
రథనేమిక్రేంకారమును వీరభటహుంకారమును గజఘంటికా
గణగణాత్కారమును దురగరింఖా పటపటాత్కారమును
విజృంభింపఁ గదువడిఁ బోయి, యదువీరుల మార్గాని
యనికిఁ దలపడిరి. అంత, వారును ధనుష్టంకారములు సేసి
కలహమునకు నిలువంబడిరి. ఇరువాఁగులవారును ఘోర
ముగఁ బోరసాగిరి. కాల్బంటు లొండొరులను దాఁకి
యీఁటెములు గండ్రగొడ్డండ్లు గుదియలు విడిచివాటుగుది
యలు కత్తులు కటారులు చిల్లకోలలు ముమ్మొనవాలులు
మొదలగు నాయుధములతో హోరాహోరిగఁ బోరు సల్పు
చుండిరి. అప్పుడు శౌరి భీత వగు రుక్మిణికి ధైర్యము చెప్పి
యూరార్చి, యుద్దండకోదండము నెక్కిడి టంకార మొన
రించి, తీక్ష్ణబాణపరంపరలను బరవీరులపైఁ బుంఖానుపుంఖ
ముగఁ బ్రయోగించి రేపు చూపి రూపుమాపు చుండెను.
అగ్ని దేవునకు వాయుదేవుఁడు దోడయినటులు, వాసుదేవు
నకు బలదేవుఁడు దోడయి, పంచశీర్షాహులం బోలు తన
దీర్ఘబాహుల హలముసలంబులఁ బూని పూనికతో శత్రు
సేనలఁ జొచ్చి, బలపరాక్రమములు మెఱయ నొక్కొక్కని
మెడకు నాఁగలి దగిల్చి యీడ్చి, రోఁకట మోఁదుచుఁ జిందఱ
వందఱ గావించి నొంచిన, నాబాధ కోర్వఁజాలక పరసై
నికులు కెవ్వున నార్చుచు మూలమూలలకుఁ బాఱిపోవసాగిరి.

అప్పుడు దండనాయకులు వారి నడ్డగించి పోనీక "శూర త్వము మెఱయఁ బోరాడక పాఱిపోవుటకుఁ బాలుఁబోతులా మీరు? ఇట్లు ప్రాణములు దక్కించుకొని మఱి యెన్నాళ్లు మనఁబోయెదరు ? అట్టి రోసములేనిబ్రదు కేటిబ్రదుకు?" అని నిందించి, వారిని యుద్ధమునకుఁ బురికొలిపిరి. అంత వారు మరలఁ దలపడి పోరి తుదకుఁ గాలునిపురమునకు వలస పోయిరి. సాత్యకి యుక్కు మిగిలి యొకవంకఁ బరసైన్య ములఁ దాఁకి దుర మొనరించుచుండెను. గదుఁడును సింగ పుంగొదమభంగి నార్చి పేర్చి యరిసేనలను బరిమార్చెను.

అంత, నా యదువీరులబారికి నిలువలేక జరాసంధా దులు కాందిశీకు లయి యొక్కచోఁ జేరి, యట నాలిఁ గోలు పోయినవానింబోలెఁ దల వ్రేలవైచి దుఃఖించుచున్న శిశు పాలు నూఱడించి "చెలికాఁడా! చైద్యా! వగవకుము. ఈచెలి కాకున్న నింకొకచెలి యూరయెను. ఇందులకా చింతి ల్లుట? ప్రాణములు దక్కించుకొని వచ్చితివే, యదియే చాలును. ప్రాప్తముకొలఁది భార్య. మనయిష్టమా? మన మీశ్వరపరతంత్రులము. పూర్వకర్మానుసారముగా సుఖ దుఃఖము లనుభవింతుము. ఇపుడు మనకుఁ జెడ్డకాలము. అయినఁ గాల మొక్కరీతి నుండబోదు. కాలచక్రము తిరుగు చునేయుండు" నని యిట్లు చెప్పి, మాగధప్రముఖులు చైద్యుని పరితాప మపనయించి, తమతమసీమలకుఁ బోయిరి. చేది భూపతియు ననుచరసైన్యములఁ గూడి తనపురమున కరిగెను.

అంత, రుక్మి కృష్ణుఁడు తనచెల్లెలిని రాక్షసవివాహమునఁ గొనిపోవుటకు సహింపక యొక యక్షౌహిణీసైన్యముతో యుద్ధసన్నద్ధుఁడై క్షిప్రమున రథమును దోలించి, "ఓరి గొల్లఁడ! నిలు నిలుము. చోరునింబోలెఁ బాఱిపోకుము. పాలువెన్నమీఁగడలను దొంగిలించినది చాలక స్త్రీలను గూడ హరింపఁ జూచితివే? ఔరా! యీ దొంగతనము నీ కుగ్గుఁబాలతోఁ బోసిన ట్టున్నది" యని తిరస్కరించుచు నారి సారించి వాఁడితూపులఁ దొడిగి వేసి హరిని నొప్పించి, మఱియు ని ట్లనియె:

సీ. మాసరివాఁడవా ♦ మాపాపఁ గొనిపోవ
నేపాటి గలవాఁడ ♦ వేది వంశ
మెందు జన్మించితి ♦ వెక్కడఁ బెరిఁగితి
వెయ్యది నడవడి ♦ యెవ్వఁ డెఱుఁగు
మానహీనుఁడ వీవు ♦ మర్యాద లెఱుఁగవు
మాయఁ గైకొని కాని ♦ మలయ రావు
నిజరూపమున శత్రు♦నివహంబుపైఁ బోవు
వసుధేశుఁడవు గావు ♦ వావి లేదు
ఆ. కొమ్మ నిమ్ము నీవు ♦ గుణరహితుండవు
విడువు విడువవేని ♦ విలయకాల
శిఖిశిఖాసమాన♦శితశిలీముఖముల
గర్వ మెల్లఁ గొందుఁ ♦ గలహమందు. (భాగవతము)

అని పలికిన, యదుకులతిలకుండు వికవిక నగి "సెబాస్! నీయుపన్యాసమునకు మెచ్చితిని. అయిన నిది సభారంగము గాదు, సమరరంగము. కావున వచ్చినపని

గావింపు'' మని యమోఘశరముల వానిపైని వర్షించి వాని
వర్మములను భేదించి మర్మముల నొంచెను. రుక్మి బొమలు
ముడివడఁ గన్ను లెఱ్ఱవాఱ మొగము జేగురింపఁ బండ్లు పట
పటఁ గొఱుకుచు సింహనాదము సేసి సింహవిక్రమము మెఱసి
క్రమముగాఁ బరశు పట్టిస ప్రాస భిండిపాల కరవాల శూల
గదా తోమరాది సాధనములు ప్రేసిన, వాసుదేవుఁడు వాని
నెల్లఁ దుత్తునియలు గావించి యంతటఁ దనివిసనక బెడి
దపుటడిదమును జేఁ బూని "యిదిగో నీకృపాణమున నీప్రాణ
మును గొనియెదను జూడు'' మని వాని నఱుక నుంకించు
సమయమునఁ బల్లవపాణి రుక్మిణి హరిచరణకమలములఁ బట్టు
కొని, వినమ్రానతవదనముతో శోకబాష్పపూరముతో
గద్గదస్వరముతోఁ "కరుణాసముద్రా! శూరాగ్రేసరా! మహా
పరాధి యగు మాయన్నను క్షమియించి కాపాడుము.
'అచ్యుతుఁ డల్లుఁ డయ్యె' నని యుల్లాస మొంది యున్న
మా తల్లిదండ్రులకుఁ బుత్త్రశోకమును గలిగింపకు'' మని
ప్రార్థించినఁ, గరుణించి యామహాబాహుఁడు చంపక
"బావా! యిటు ర'' మ్మని వానిని బట్టి, తేరికంబమునకుఁ
గట్టి, గడ్డమును మీసమును దలయును మూఁడు రేవులు
గొఱిగి విరూపు నొనర్చెను. ఇంతలో శత్రుసైన్యముల నుఱు
మాడి బలరాముఁ డచటికి వచ్చి చూచి, "యాహా!
యి దేమికార్యము! ఇది యేమివీర్యము! ఇట్టియకార్య మేల
చేసితివి? తమ్ముఁడా! యిటులు తల గొఱుగుట తల దఱుగుట
కంటె నీచతరము కదా?'' యని పలికి, రుక్మిని బంధము

నుండి విడిపించి, రుక్మిణీదేవిని జూచి "యమ్మా! నీదుసోద రునిభంగపాటునకు నొచ్చుకొని మాకృష్ణుని నెగ్గాడ నెంచ కుమా" యని యామెకు హితబోధ యొనర్చి యోదార్చెను. రుక్మి ప్రాణమాత్రావశిష్టుండై వికృతరూపమునకుఁ బరితపించి, కృష్ణుని గెల్చి కాని కుండినపురమునఁ గాలు పెట్ట నని ప్రతిజ్ఞ సేసికొని యూప్రాంతముననే నిలిచెను. వాఁ డట్లు నిలిచినప్రదేశమే 'భోజకటక' మనుపేరిట నొకపుర మేర్పడెను. ఇవ్విధమున శత్రువులను బాఱఁదోలి యదువీరులు విజయోత్సాహులై త్వరగఁ బయనించి ద్వారకను జేరిరి.

---

## వివాహమహోత్సవము.

అంతట, ద్వారకానగరము సర్వాలంకారములతో శోభిల్లుచుండెను. ఎందుఁ జూచినను, స్వాగతతోరణద్వారములతోను కేతనములతోను జలువపందిళ్లతోను ముత్యాల చవికలతోను విలసిల్లుచు నుండెను. మంగళతూర్యఘోషములు చెలంగుచు నుండెను. హరిపెండ్లికి యదు విదర్భ కురు సృంజయ కేకయ కుంతి మహీకాంతులు మహాసంతోషముతో వచ్చి చేరిరి. అప్పుడు, విశ్వకర్మచే వినిర్మితమైన వివాహ మంటపమున హోతలు ఋగ్వేదమును నధ్వర్యులు యజుస్సును నుద్గాతలు సామవేదమును నథర్వణు లథర్వవేదమును ఘోషింప, సుముహూర్తమున, నిజమనోహారిణిని సకలసంపత్కారిణి నతిథిబాంధవసత్కారిణిని భవ్యచారిణిని సతీశిరోమణి నానకదుందుభినందనుఁడు సురుచిరయశోభిశోభితముగాఁ

పెండ్లియాడెను. అటులు లోకపావను లగు నా నూతనవధూవరు లెదురెదురుగ నిలిచి యొండొరులపైఁ దలఁబ్రాలు దోయిలించి దోయిలించి పోయునపుడు, పుష్పలతికపోలిక రంగారు రుక్మిణీదేవితోఁ గూడి, కల్పవృక్షముంబోలె నొప్పారుచున్న యాకృష్ణమూర్తికి సకలసురు "లాశ్రితపారిజాతా! మా వందనములఁ గైకొను" మని చేతు లెత్తి మ్రొక్కిరి; ఆనందసూచకముగా నానకదుందుభులు మొరయించి పుష్పవర్షమును గురిసిరి. నారదతుంబురులు వీణలు వాయించిరి. గంధర్వులు గానము సేసిరి. రంభాద్యప్సరఃకామినులు నృత్యము చేసిరి. ఈప్రకారము, లక్ష్మీనారాయణులైన రుక్మిణీకృష్ణులకుఁ బరమవైభవముతోఁ గల్యాణంబు జరిగెను. తదనంతరము, విదర్భాది రాజబంధువులు సముచితమర్యాదలం జేసిరి. పౌరులు పరమసంతోషమునఁ గానుకలు దెచ్చి సమర్పించిరి.

అని శుకమహర్షి వక్కాణించినఁ, బరీక్షిన్నరపాలుఁడు "ధన్యుండ నయితి" నని యానందించెను.

శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీ

# సావిత్రి

ఆ. మాత జనకుఁ డత్త మామ తోఁబుట్టువుల్
పతియు సుతులుఁ దన్నుఁ బలుదెఱఁగుల
నుతు లొనర్ప బ్రదుకుసతికి సత్కీర్తి సౌ
ఖ్యమ్ము లబ్బు టేమి యబ్బురంబు ?

(స్త్రీనీతిసంగ్రహము).

శ్రీమ దహీనమహీమండల మండనాయమానమును సకల నైసర్గిక స్వరూప విరాజమానము నగు నీ భరతసామ్రాజ్యమున కుత్తరపు టెల్ల యయి మహోత్తుంగ శృంగ దీపిత పర్వతరాజ మయిన హిమవంతమునకుఁ బ్రాంతమున మద్రదేశం బొండు వెలయుచుండు. దాని కధిపతి యయి యశ్వపతి యను నొకరాజోత్తముఁ డుండెను. ఆయనకు మాళవదేశపురాజుకూఁతురు మాళవి యనునామె భార్య యయ్యెను. ఆరాజదంపతులు బిడ్డలు లేక సావిత్రీదేవిని గొలుచుచుండిరి. అంతఁ బదునెనిమిదేండ్లకు నాదేవి వరమువలన మాళవి యొక ముద్దుఁగూతుం గనెను. అది కారణముగ వార లాచిన్నారికన్నియకు సావిత్రి యని పేరిడి, యఱచేతినిమ్మపండువలెఁ గడు గారాబముతోఁ గాపాడుచుండిరి. బాల్యముననే తండ్రిపనుపున నాబాలిక పండితుల యొద్ద సంస్కృతమును దేశభాషలను లెస్సగఁ గఱచి, పెక్కు నీతికథలు పురాణము లితిహాసములు శ్రద్ధతోఁ జదు

వృచు దైవమునందును బెద్దలందును దల్లిదండ్రులందును భక్తివిశ్వాసములతో వర్తిలుచుండెను. యుక్తవయస్సు వచ్చుటతోడనె యా సుందరవదనకుం దగినవరుని గూర్చి తండ్రికి విచారము కలిగెను. ఆమెగుణము నామెరూపము నామెవివేకము నామెకుం గల దైవభక్తియు నేమి చెప్ప! నాతఁడు తలఁచి తలఁచి యట్టె యుపేక్షింగెను. అంతట నొకనాఁడు పూజాద్రవ్యములు దేర, సావిత్రి చెలికత్తెల తోడఁ గూడి చేరువవనమునకుఁ బోయెను. ఆయడవిలో నొక్కయెడ నాజవ్వని పువ్వులఁ గోయుచు నొక రాకుమారునిఁ గాంచెను. మహర్షులతో నొక్కకప్పుడు సద్గోష్ఠి నుండు సాక్షాత్పురందరునిఁ బురుడించుచు, మునికుమారుల నడుమఁ గూర్చుండి యారాజకుమారుఁడు మొలకనవ్వులు మోమునఁ దులకింప, వారితో మృదు మధుర గంభీరోక్తు లాడుచు వినోదగోష్ఠి నుండెను. రాజస్యకన్య యా నవయౌవనుని రూపసంపదను ముఖవికాసమును దీర్ఘభుజదండములను విశాలవక్షమును దేహకాంతిని దిలకించి పులకించి, యా సౌందర్యజితమారుఁడు రాజకుమారుఁడ యని నిశ్చయించి, యతనిని మనంబున వరియించి, యాతనివృత్తాంతము నారసి రం డని చెలులను బుత్తెంచెను. వారును విచారించి వచ్చి సావిత్రితో నిట్లనిరి:—

"అమ్మా! యాసుందరపురుషుఁడు సాళ్వదేశపురాజు కొమారుఁడు. సత్యవంతుఁ డనువాఁడు. సాళ్వపతి వృద్ధుండు

నంధుండు నగుటచేఁ బరరాజువలన రాజ్యంబు గోలుపోయి కుటుంబముతోడ నడవిపా లయ్యె నఁట.''

ఈ యుదంతము విని యా సుదతీమణి యా రాచ చందురుని యందము చందమునకు డెందమునందు నమందానందము నొంది, మనఃకేతనము మదనవాతముచేఁ దప తపఁ గొట్టుకొనుచు నాతని దిక్కునకె నిక్క, వెనుదీయు నడుగులతో నెట్టకేలకు. గష్టంబునఁ దోడియింతులఁ గూడి యంతిపురముం జేరెను.

అనంతర మొకనాఁడు మద్రదేశ్వరునికడకుఁ ద్రిలోక సంచారి యగునారదుఁడు మహతీసమాహ్వాయవీణాపాణి యై విచ్చేసెను. ఆ దేవర్షి నారాజచంద్రుఁడు పూజించి యుచితాసనాసీనుం జేసి ''మహాత్మా! నేఁడు సుదినము. భవత్పదాంబుజస్పర్శముచే మదీయ భవనంబు పావనం బయ్యె. నేను ధన్యుండ నైతి'' నని పలికి, యతనితో సద్గోష్ఠి నుండెను. నారదమహామునియంతటి పెద్దలు వేంచేసినది విని, సావిత్రి యతికుతూహల యై యట కేతెంచి, యామహామహుని పదపద్మములకుఁ బరమ భక్తితోఁ బ్రణమిల్లెను. నారదమహర్షి యెంతో సంతోషమున 'దీర్ఘసుమంగలీ భవ' యని యాశీర్వదించెను. మఱియు, నా బాలామణిరూప లావణ్య శుభలక్షణముల నుపలక్షించి నారదుఁడు ముదమంది ''రాజేంద్రా! యేల యీముద్దియ కింకను బెండిలి సేయ కుంటివి? ఈమెభక్తి వినయాదిసుగుణములకును శుభ రూపలక్షణములకును దోడుగఁ, బసిఁడికిఁ దావి యబ్బినట్లు

వివేకమును వెలయుచున్నది. ఇట్టి వివేకవతియిష్ట మెఱింగి వివాహము గావింపు''మని, సావిత్రివంకఁ జూచి ''యమ్మాయి! నీయెడమచేయి చాఁపు'' మని పలికి, యామెయఱచేతి యందలిసాముద్రిక రేఖలఁ బరికించి చూచి మందహాసము చేసి ''బళిరే! యీ పరమకల్యాణికి సకలసాముద్రికలక్షణము లమరియున్నవి. ఈ యమకు శ్రేయములు చేకూఱును. ఈమె పుట్టినింటికిని మెట్టినయింటికిని వన్నెయు వాసియుఁ దెచ్చునట్టిది. ఈ బిడ కొన్నికడగండ్లు వడినను దైవకృపచే నవి తొలఁగ, నిజపాతివ్రత్యప్రభావముచేత శాశ్వతకీర్తి సంపాదించి పుత్త్రశతంబుఁ గాంచి భర్తృవంశంబును వృద్ధి గావించును. ఈమెయందు ధైర్యలక్ష్మి నిత్యనివాసము సేయుచున్నది. పురుషులకుఁగూడ నిట్టిధైర్యస్థైర్యములు లే వనవచ్చును. మఱియును, దైవభక్తి పరిపూర్ణముగాఁ గలదు. కావున దైవతంబు సంతతం బీ వనితకుఁ దోడునీడ యై యుండు'' నని నుడివెను.

అప్పు డశ్వపతి కూఁతుం జీరి ''తల్లీ! నీగుణరూపవర్తనములకుఁ దగినపురుషునిఁ గోరికొనుము. ఆ రాజకుమారునిఁ దప్పక నీకుఁ బెండ్లి సేయించెద'' నని మందలించెను. అందులకు సావిత్రి ''తండ్రీ! సాళ్వపతికుమారుఁడు సత్యవంతుఁ డనువాఁడు నామనసునకుఁ గూర్చువాఁడు. నే నతనిఁ బెండ్లియాడెద'' నని నిజాభీష్టంబును దెలుపఁగా, మద్రేశ్వరుండు త్రికాలవిశారదుని నారదునిఁ జూచి, ''యో మౌనివర్యా! మీ రెఱుంగనిది యేదియు లేదు. సావిత్రి వరించిన రాకు

మారుని వృత్తాంతము నెఱింగింపుఁ" డనిన, నమ్మునీశ్వ రుండు జ్ఞానదృష్టిని జూచి, విషణ్ణహృదయుఁ డై "రాజేంద్రా! యా సత్యవంతుఁడు సత్యసంధుఁడు, దయాసింధుఁడు, సుగుణ సంపన్నుఁడు, నవమన్మథాకారుఁడు, సకలవిద్యాపారంగ తుఁడు. ఆ రాజసుతునకుఁ జిత్రాశ్వుం డను నామాంతర మును గలదు. కాలవశంబున వానితండ్రి ద్యుమత్సేనుఁడు రాజ్యవిహీనుఁడై సకుటుంబముగా వనవాసము సేయుచున్న వాఁడు. ఇది యొకలక్ష్యములోనిది కాదు. కాల మొక్క రీతిగనే యుండదు. అయిన, నేమి యడ్డంకి యందువా? అహో! కష్టము! ఆ సత్యవంతుఁ డాయుష్మంతుఁడు కాఁడు. పెండ్లి యయిన మఱుసటి సంవత్సరముననే యతఁడు మృతి నొందు" ననవుడుఁ, దండ్రి కుమారికను జూచి "యమ్మా! యిమ్మహనీయుఁడు వచించినది వింటివి కదా? ఈయనమాట సత్యము. నీకు నట్టివరుఁ డేల? ఎందఱో రాజపుత్త్రులు కలరు. మఱియొకని వరింపుమా" యనెను.

అందులకు నా విదుషీమణి యిట్లు లనియె: "త్రికర ణము లగు మనో వా క్కాయములలో మనస్సు ప్రధానము. అట్టి మనస్సుచే వరించినవరుని విడిచి యొరునిఁ గోరను. సత్యవంతుఁ డెట్టి వాఁ డైనను సరే. అతనినే నేఁ బెండ్లాడు దును."

అనిన, నశ్వపతి నారదునివంకఁ జూచెను. అంత నామహాత్ముఁడు "రాజోత్తమా! యీ యుత్తమకన్యమదిని ద్రిప్ప నేరితరము కానేరదు. సత్వరముగ నా చక్కని

రాచకొమరునికే యీ చక్కెరబొమ్మ నిచ్చి పెండిలి గావిం పుము. పతివ్రతలు భర్తృహీనలు కానేరరు. మదీయాశీర్వచనబలముచేతను సావిత్రీనిరతవ్రతపూజాఫలముచేతనుఁ దత్పాతివ్రత్యమహిమవలనను నైదువతనమునకుఁ గొదవ యొదవ'' దని పలికి యథేచ్ఛం జనియెను.

వెంటనే, యొకశుభదివసంబున మద్రభూపతి మంత్రి పురోహితబంధుమిత్త్రులతోడ సావిత్రిం దోడుకొని, యుప్పు మొదలు కప్పురమువఱకుం గల పెండ్లిసామగ్రులఁ బెక్కు బండ్లపై నెత్తించుకొని, సాళ్వుని యాశ్రమమునకుం బోయెను. అంతట నారాజర్షి సంభ్రమంబు గొని యశ్వపతి కతిథిసత్కారంబు సలిపి యతనిరాకకుఁ గారణం బడిగిన, నశ్వపతి సాళ్వపతిం జూచి ''యయ్యా! యీ కన్నియ నాయనుంగుఁగూఁతురు. నీపుత్త్రుండు గుణవంతుఁడు విద్యావంతుఁడు వివేకవంతుఁడు నగుటంజేసి, యాతనికిఁ గన్యాదానంబు సేయం గోరితి. మీరు నాతో వియ్యమంది నను గారవింపవలయు'' నని నుడివి, యతని యడుగుఁదమ్ములకు సావిత్రిని మ్రొక్కించెను. అపుడు సాళ్వుం ''డార్యా! మేము రాజ్యవిహీనుల మై యరణ్యమే శరణ్యముగా నిందు వాసము సేయుచున్నాము. ఈబాల యతిసుకుమారి. అడవిని మాతోడ నిడుమలఁ బడనోప'' దనిన, మద్రపతి యి ట్లనియె:-

చ. కలిమియు లేమియుం సతము
గా వవి పొందినచోఁ దెలంగుచుం
గలఁగుచు నున్కి ధీయుత ప్ర
కార మె ఱెప్పగ నింతవట్టు నేఁ

తెలియుదుఁ జెప్పెదన్ వసుమ
　　తీవర! పిన్న యనంగ నేల? యే
కొలఁదియుఁ గాదు; ధీరమతి
　　గూఁతురు పేర్కొనఁజాలుఁ బెంపునన్.

క. నీతోడ వియ్యమందం
జేతోగతి నాసఁ జేసి - చెచ్చెర నిట్లే
నేతెంచితి మత్ప్రార్థన
బ్రాఁతిగఁ జేకొనక యునికి - పాడియె నీకున్? (భారతము)

"కలిమిలేములు కావడికుండలు. ధీరులు సంపద వచ్చిన దని సంతోషింపరు. ఆపద వచ్చె నని యాకులత నొందరు. ఈ కుమారి వయసునఁ జిన్నది యయ్యు బుద్ధిని బెంపు గన్నది. మిగుల నోర్పును నేర్పును గలయది. ఆ విష యమున మీకుఁ జింత వలదు. మీ బోంట్లతో వియ్య మందఁ గోరి చయ్యన నియ్యెడకే యేతెంచితి. నా యభిమతంబు నెఱవేర్పమి న్యాయ్యమా?" యనియెను.

అందులకు సత్యవంతునితండ్రి సమ్మతించి, ముని జనంబు వేదఘోషంబు సేయ, సుముహూర్తంబున సావిత్రీ సత్యవంతులకుఁ బాణిగ్రహణం బొనరించెను.

మద్రదేశుండును గూఁతునకు నల్లునకు విలువ గల పలు వగల క్రొన్నగలను మిఱుమిట్లుగొను బంగరుజరీపట్టువలువలను బ్రేమ మీఱ నొసంగి, వియ్యంకునిచే వీడుకోలు వడసి, తనదు ప్రోలికిం జనియెను.

తదనంతరము, సావిత్రి యనర్ఘవస్త్రభూషలను మాని యడవియునికికిం దగిన నారచీరలు దాల్చి, బత్తి మీఱ నత్త మామలకు నుపచారములు సేయుచుఁ, బతియే దైవంబుగా

భావించి, గృహకృత్యముల నయ్యయికాలంబులఁ జులుకుగా నెఱవేర్చుచు, నెల్లవారికి నల్లాగుముద్దుగా మెలఁకువతోడ మెలఁగుచుండెను.

ఆ యిల్లాలి దినచర్య యెట్టి దనఁగా:—

సీ. పతికి మున్నుగ లేచి ప్రాఁచిపనులఁ దీర్చి
పసపాడి తల గువ్వి పంకజాక్షి
మడుఁగుఁజీరను గట్టి మతియుఁ గుంకుమ పెట్టి
యత్తమామలఁ జేరి బత్తి నెరఁగి
యంతట మేల్కొన్న కాంతున కెదు రేగు
లచ్చి ప్రసన్నయై వచ్చె ననఁగ
గృహకృత్యము లొనర్చు బహుసమర్థతతోడ
దేవపూజలు సేయు దినదినంబు

తే. నహహా! పావిత్రిగుణగణం బగణితంబు
పలుక శైనను వేనోళ్ల చిలుక కైన
చతురగురువర్యునకు నైన; నట్టి గరితఁ
దలఁచువారల దురితముల్ ధ్వంస మగును. (స్వకృతము)

ఇట్టి పావనచరిత యలనాఁడు నారదుఁడు వచించిన ప్రకారము భర్తయాయుఃప్రమాణమునుగూర్చి దినములు లెక్కించుకొనుచుండెను. సత్యవంతునిజీవితమునకు నింక నాలుగుదినములే కొఱవడియున్న వనఁగా, నపు డా గుణ గరిష్ఠ పరమనిష్ఠమెయి వ్రతానుష్ఠానముం బూని మూఁడు రాత్రు లుపవసించెను. అత్తమామ లాకోమలివ్రతదీక్ష కక్కజము నొంది, "యమ్మాయి! యే లయ్యెయిఁ గఠిన వ్రతమును బూనితివి? నీవు పసిదానవు. ఉపవాసములచే శరీర మేల శుష్కింపఁ జేసికొనెద" వని యడుగ, వారలకు నామె "మీ రీనోముకష్టమునకుఁ జింతింపవలదు. నేమముం

గోరి పూనినదానను ఈవ్రతాచరణమునకుఁ గారణము నీమ్మటఁ దెల్లం బగు” ననుడు, వారును భగవదారాధనమునకు భంగ మొనరింపరా దని మిన్నకుండిరి. ఆమూఁడు దినములును గడచెను. అంత, నాలవనాఁటి వేకువను మేల్కాంచి సత్యవంతుఁ డెప్పటిచొప్పున సమిత్కుశ కుసుమ ఫలంబులు దెచ్చుటకు బైలుదేఱుటయు, నాఁడు జీవితేశుని కవసానదివసము గావున సావిత్రి “నేఁడు ప్రాణనాథుని నేమఱఁగూడ” దని మదిని నిశ్చయించి, పతిసాన్నిధ్యముం జేరి, “ప్రాణేశా. నీతోడఁ గూడి నేఁడు వనవినోదముఁ జూడ వేడుక య్యె; కూడ దసక తోడుకొని పోవే” యని వేఁడుకొనియెను.

పతియు సతిని జూచి “ప్రేయసీ! నీవు మూఁడు రే లుపవసించుటం జేసి కడుం బడలియున్న దానవు. నావెంట రాఁజాలవు. మఱియొకనాఁడు కాని” మ్మనియెను. అందుల కా సాధ్వీశిరోమణి “ప్రాణేశ్వరా! నీతోడి వనవిహారంబునఁ బంచేంద్రియపర్వము లగు నివ్వనవినోదములు మదీయోపవాసశ్రమంబును బరిహరించునుగాదే” యని పతిని బతిమాలిన, నతం డియ్యకొని, సహధర్మచారిణి యగు నమ్మానినీమణిని వెంట నిడుకొని చనియెను.

ఇటు లా మద్రరాజపుత్త్రి సావిత్రి దుర్భరవిచారగ్రస్త యయ్యు, మనోవ్యథను ముఖమునఁ దోఁపనీక వనవిహారవ్యాజంబునఁ బతిని వెంబడించి పోవుచుండెను.

ఆ యౌవనవతి యత్యంతచింతాకులితచిత్త యగుటం

బట్టి యవ్వనరాజమునందలి తామరకొలంకులును, వానికెలం
కుల వెలయు పూఁబొదరింట్లు, నవ్వానిపై నల్లికబిల్లికగ నల్లి
కొని యుండు వల్లికలును, బరిసరంబులఁ గల ఫలభరితమహా
భూరుహంబులును, నా పెనుమ్రాఁకుల నెగఁబ్రాఁకి పూవుం
గుత్తులతోడను గెంజివురుజొంపములతోడను శోభిల్లుచుఁ
జల్లనిగాడ్పుల, కాజవ్వని లేయొడలివడువున జవ్వాడుతీఁగలును
గనులపండువు సేయ వయ్యె. లతాంతములనుండి కాఱు
తేనెసోనల నాని మదించిన తుమ్మెదల రొదలు తంబుఱ
నాదుగా మెఱయు సొంపు చెవుల కింపు గావింప దయ్యె. ఆ
కలకంఠకంఠికంఠస్వరమువలెనే సుస్వరంబగు యత్యంత
మనోహరంబగుశుకపికశారికాదిశకుంతసంతానగానవినోదము
వీనులవిందుసేయ దయ్యె. ఆ శకుంతసంగీతమున కనుసరణ
గతి నచ్చటి కాసారంబులనీరంబులు మందమారుతముచేఁ
దరంగములరూపున సోపానములఁ దాఁకుటవలనఁ గలుగు
మృదంగతాళమానములు శ్రావ్యహీనము లయ్యె. గుమ
గుమ యని గుబాళించు వివిధకుసుమపరిమళంబులును జందన
వృక్షముల సౌరభములును ఘ్రాణేంద్రియమును దనుప
దయ్యెను. జలంబులఁ దాఁకి చల్లఁగా వీచు తెమ్మెరలు నెమ్మే
నికి సుఖంబు గూర్ప వయ్యెను. ఇవియును గాక, యందందు
వెలయు గురివెందపందిళ్లయందలి చలువఱాతిన్నెలపై నా
యన్నులమిన్నను గూర్మిమగండు గూర్చుండఁబెట్టుకొని బుజ్జ
గించుచు "మాయురె! ప్రేయసీ! యెంతహాయిగ నున్నది
యీ స్థల!" మనును. ఆ మరునిపూబంతి సొగసులదొంతి

సత్యవంతునియింతి వంతను వెలికిఁ దోఁపనీక తాఁ సంతసించి నటు లనుకరించుచుఁ బెనిమిటి నలరించును. సాళ్వపతి కుమారుఁ డచ్చటి వివిధఫలవృక్షంబులఁ జూపి "కనుఁగొంటే మచ్చెకంటీ! పరమయోగ్యులట్లు యీచెట్లు క్రమఫలభారంబుచే వినమ్ర మయి యున్నవి" యనుచు, వానికొమ్మల వ్రేలుచున్న స్వాదుఫలంబులఁ గోసి, తనదుకొమ్మ యగు నాముద్దుగుమ్మకుఁ బ్రీతిమై నిచ్చును. నిజవల్లభునియుల్లంబు నెల్లప్పుడుఁ బల్లవింపఁజేయు సుస్వభావ యగుటవలన మనస్సంకటమును మఱుఁగుపఱుచుటయం దేమఱక యాపండ్లను గైకొని వాని నొలిచి ప్రాణపద మగు పతికి మొదటఁ దిన నొసఁగి పిమ్మటఁ దానును దిని, పెనిమిటికిఁ దృప్తి కలిగించును. ఆసరసుఁడు నిజకాంతకరముం బట్టికొని యొకసరోవరముసరసకుఁ బిలుచుకొనిపోయి "చూచితే కమలనేత్ర! యీ విమలజలములు సాధువులహృదయములట్లు స్వచ్ఛ మయి యున్నవి!" యని మెచ్చి, యాతేటనీటిని దాఁ గ్రోలి దయితను ద్రావించును; పరమరమ్యంబు లగు నరవిందములఁ గోసి యామెమృదుకరములం బెట్టి కరము బుజ్జగించును. మఱియు నతఁ డాపద్మాకరపుఁ దరంగమాలికలపై వికసితపద్మకోలికలం దూఁగుచున్న రాజహంసములను బ్రియురాలికిఁ జూపును. అం దొక్కమరాళి సుందరమందగమనమునఁ దన పిల్లలగూఁటిచెంత విహరించుటను సత్యవంతుఁడు గనుంగొని "యయ్యారె యంచయానా! యారాయంచ యొయ్యారంపు నడకసొంపు గాంచితే! దీన్ని హొయలునడకు మెచ్చియే

యుల్ల చతురచతురాననుండు హంసను వాహనముగఁ గైకొనెఁ గాఁబోలు!'' నని వర్ణించును. అచటు వాసి కొంత దవ్వు చని "యల్లదె! కురంగనేత్ర! యాచక్కని కురంగము కురంగితోడ సయ్యాట లాడుచు నెంత చెలువముగఁ జౌకళించు చున్నది" యని దయితుండు మందలించుచు మందయానకుఁ జూపును. ఆ యిందుబింబానన మందహాసము మోమునఁ దులకింప నామృగీమృగముల క్రీడావిలాసమును దిలకించి, నిజచిత్తాపహారునిఁ గ్రేఁగంటఁ గన్గొని, యతనికిఁ జిత్తాపహారము సేయును గాని మనోదుఃఖము మొగమునఁ దోఁపనీయదు. ఒక్కెడఁ జంపకవల్లులు పొదరుటిల్లు నల్లుకొని గుళుచ్ఛములబరువుతోఁ బిల్లగాలులకు నల్లలాడు చుండు సొబగును జూచి, రమణితో రమణుండు "తిలకించితే తిలకినీ తిలకమా! ఈసంపెంగతీఁగెలు పూవుగుత్తుల ప్రేఁగుతో, నీదు నురోజభారముచే లేఁగౌఁదీఁగియు వీఁగియాడుచాడ్పున, గాడ్పులకుఁ గడుంగడు జలించుచున్న!'' వని సరస మాడుచు, నాసంపఁగెపూగుత్తులఁ జిదిమి "యివిగో నీ యలకులు నీదు నాసపగిది నెంతయు నొప్పారుచున్నవి! కనుక నొప్పరికింపక వీనిం గొప్పునం బెట్టి గొప్పసేయు టొప్పగు'' నని కడు నాసతో నా రసికశిఖామణి సతీమణిశిఖం జొరివి, చిఱునగవు నగును.

సీ. కమనీయకమలినీ-కల్లోలవీథులఁ
గదలు రాయంచల-గతులఁ గొప్ప
బహుపుష్పపల్లవ-ప్రకరచిత్రితము లై
తనరారు తరులతా-తతులసొంపు

మకరందరసపాన-మదవిలోలంబు లై
 క్రాలెడి యెలదేఁటి-గములయులివుఁ
బరిపక్వమంజుల-ఫలరసోద్ధతము లై
 పలుకు రాచిలుకల-పటురవంబుఁ
ఆ. ప్రియుఁడు వేలువేల - ప్రీతిమైఁ జూపుచుఁ
 జెప్పుచును జనంగఁ - జిగురుఁబోఁడి
 గనుచు వినుచు నిర్వి-కారసల్లాపంబు
 లార నతని తెలఁగు - నరయుచుండె. (భారతము)

ఇట్లు చిత్రాశ్వుఁడు చిత్రవిచిత్రముల నెసక మెసఁగు నా చైత్రవనమునందలి వింతల సావిత్రికిం జూపుచుఁ దదీయరామణీయకమునకు ననుగుణముగ సరసోక్తు లాడుచు, నక్కడక్కడ నడ్డపడు పిల్లకాలువల మెల్లన నాచెలువను దాఁటించుచుఁ దోడ్కొని పోయిపోయి కొండొకచోఁ గాంతను 'గూర్చుండు' మని చెప్పి, కాంతుండు వంటచెఱకుకొఱకుఁ జెట్టుకొమ్మల గొడ్డంట నఱకుచుండెను.

ఆహా! పాపంపువిధి నే మనవచ్చును! కాల మెప్పుడు తీఱునా యని కాలుఁడు కాచుకొనియే యుండును! ఔరా! మృత్యుదేవత బారికిఁ జిక్కక దక్కువారు గలరా?

అతఁడు తరుశాఖల నఱకుచుండుతఱి నలసటచే నెమ్మేను ముమ్మరముగఁ జెమ్మరింప సొమ్మసిలి నిజసతితో ని ట్లనియె: "కాయము కంపించు చున్నది. తల దిరుగు చున్నది. గుండెలు దడదడఁ గొట్టుకొనుచున్నవి. కాలుసేతులు తూలిపోవుచున్నవి. శ్రమనివారణార్థ మించుక తడవు పండుకొనియెద" నని యామెనునుదొడపయిఁ దల నిడి పరుండెను. అంతట 'సావిత్రీహృదయాబ్జమిత్త్రుం' డకాలమర

ణమును బొరయునది చూడ నోప' నని మిత్తుగ్రిం డ స్తం
గతుఁ డగుచుండెను. చిమ్మచీఁకటులు గ్రమ్ముకొనఁ దొడఁ
గెను. అప్పుడు ప్రతిక్షణమును సావిత్రీప్రతీక్షణమునకుఁ
బాత్ర మఱు యుండెను. ఆమెమనంబున ఘనం బగు వ్యస
నంబు పాదుకొనియెను. 'నేఁడు పతిగతి నే మగునో'
యని శంకించును. నాఁడు నారదుఁ డాశీర్వదించినది తలంచి
తల పంకించును. 'ఆపద్బాంధవుఁడు దేవదేవుఁ డు విపదం
బుధినుండి కృపతో దరిఁ జేర్చువాఁడు గదా'' యని ధైర్య
మవలంబింప నుంకించును.

ఇట్లు దురంతచింతాక్రాంత యై యా కాంతామణి
కాంతారమధ్యమున నేకాంతమునఁ జిక్కి నిజకాంతుని నంక
భాగంబునఁ జేర్చి యుండు సమయమున, సత్యవంతునికి నోడ
లెల్లఁ జలువలు గ్రమ్మి చల్లఁబడియెను. క్రమముగ
నుచ్ఛ్వాసనిశ్వాసములు నిరోధింపఁబడుచుండెను.

ఈవైపరీత్యమును జూచి ''మృత్యు వాసన్న మగు
సన్న''లని యావనిత నిశ్చయించి, ''హా దైవమా! యీపుణ్యా
త్ముఁడు భూదేవికి బరు వయ్యెనా! రాజ్యంబు కోలుపోయి
తల్లిదండ్రులతోడ నడవి పాలయి, వారికి శుశ్రూషలు సలు
పుచు భద్రచరిత్రుం డయిన యీ మహనీయుఁ డాయుస్సు
నకుఁ గూడ నోఁచుకొనకపోయెనా! కరుణాసముద్రా! భక్త
వత్సలా! యాశ్రితపారిజాతా! నిన్ను సదా భజించువారికి
నెట్టిచెట్టలు భంజింపఁబడును గదా! నాదుపతికిఁ బ్రాణదా
నంబు సేయుము. ఈమహాపదను బాపవే దేవదేవా! మహాను

భావా! గత్యంతరము లేదు. ప[illegible] నాకుఁ బతిభిక్ష పెట్టు!" యని పరిప[illegible]విధముల [illegible] ప్రార్థించుచుఁ గన్నీరు మున్నీరుగాఁ గార్చుచు వెచ్చ నూర్చుచుండెను.

అట్టిసమయమున యముండు సత్యవంతుని సమీపించి తన పటుపాశముల నతనిపై వైచి ప్రాణములఁ గొన నుంకించెను. అకలంక యగు నా పంకజాక్షియంకపర్యంకమున సత్యవంతుని శిరం బుండుటంజేసి యామెపాతివ్రత్యానలజ్వాలలకుఁ జేర వెఱచి, యవి యాతనియసువులం గొన నేరవయ్యె. అంత నాగ్రహవిస్మయంబులు మదిని బెనంగొన నంతకుఁ డొక్కసారికి మువ్వూఱు ప్రయత్నించి విఫలుఁడయ్యెను.

అప్పుడు సావిత్రి తల యెత్తి చూచెను. ఆమె ముంగల నీలమేఘముంబోని మేనివాఁడును వాఁడికోఱపండ్లవాఁడును బంగరుచాయవలువవాఁడును బాశపాణియు నగు నొకమహాపురుషుఁడు పొడకట్టెను. వెంటనే సావిత్రి జీవితేశ్వరుని శీర్షమును గ్రింద నునిచి లేచి, భయభక్తులతో నాదివ్యపురుషునికి మ్రొక్కి, నమ్రతతో నిట్లనియె:—"అయ్యా నీ వెవ్వఁడవు? నిన్నుఁ జూడ మహనీయుఁడవుగా నున్నావు. ఏల యిచటికి నేతెంచితో దయతోఁ దెలుపుమా" యనిన, నా పుణ్యపురుషుఁడు "తల్లీ! దక్షిణదిక్పాలుఁ డగు కాలుఁడను. నీజీవితేశునిజీవితకాలము తుది ముట్టినది. కావున నీతనిప్రాణములు గొంపోవ వచ్చితిని. ఇతఁడు పుణ్యాత్ముఁడు;

సచ్చరిత్రుఁడు. కాఁబట్టి నాదుకింకరుల నంపక నేనే చను దెంచితి. నీవును బరమపతివ్రతవు గావున, నీకు దృగ్గోచరుఁడ నైతిని. పరు లేరు నన్నుఁ గనుఁగొనలే'' రని చెప్పి, సత్యవంతునిపైఁ బాశంబుల మరల వైచి ప్రాణంబులఁ గొని దక్షిణదిశాభిముఖుఁ డై నడచు చుండెను. క్షిప్రంబున సావిత్రి పతికళేబరము నొకచోఁ బదిలపఱిచి, భయకంపిత గాత్ర యై పరేతరాజువెంటఁ దగిలి పోవసాగెను.

కతిపయదూరము చని కాలుఁడు తన్ను వెంటాడి వచ్చుచున్న యా యబలను దిరిగి చూచి ''బాలా! యేల వేల వై యీలీల వెంటఁ బఱతెంచెదు? నీకుజీవితేశుఁడు జీవించు ననెడి యాశ వదలుకొనుము. అతనిజీవితకాలము తీఱెను. నేను జనుమార్గము దుర్గమము. మరలి పో'' మ్మని చెప్పఁగా, నా కమలాయతలోచన శోకబాష్పములు విడుచుచు శమనుం జూచి యిట్లనియె:—

క. పతు లెందుఁ జనిన నచటికి
సతులకుఁ జనవలదె నీ ప్రసాదమునను మ
త్పతిభక్తి కతమునను సం
స్తుతగుణ! నా కరుగరాని - చోటులుఁ గలవే? (భారతము)

''పతు లెందుఁ జనిన సందులకు సతులు సనవలయుఁ గదా? నీదుననుగ్రహంబునను నాదుపతిభక్తివలనను నాకుఁ జన రానిచోటులు గలవే? భర్తృసహధర్మచారిణిని నన్నుఁ జను మనుట చన్నే? సర్వమార్గములందును ధర్మమార్గ ముత్తమము. అట్టిధర్మమున కాధారభూతులు సజ్జనులే యని నీతి

కోవిదులు వక్కాణింతురు. అట్టి సజ్జనసందర్శన మొకప్పుడును వృథవోవదు గదా. ఓ సుజనోత్తంసా! వృజినధ్వంసా! నీయంతటివాని సుదర్శనంబునఁ బరమకల్యాణంబు నొందక నే నెట్టులు మగుడుదు?''నని పలికిన, నామెవాచాలమునకును సమయస్ఫూర్తికిని నబ్బుర మంది యమధర్మరాజు ''విదుషీమణీ! కర్ణామృత మగు నీ వచనంబులకు నాదు డెందంబమందానంద మందినది. నీదు పెనిమిటిప్రాణంబు దక్క వేఱొక్క వరంబు వేఁడు మిచ్చెద'' ననిన నాయింతి యెంతయు వినయంబున ''ధర్మరాజా! మదీయశ్వశురునకు సాళ్వభూమీశ్వరునకుఁ బోయినదృష్టియు రాజ్యమును మరల ని'' మ్మని యడుగుటయు, ''నట్ల యగుఁగాక. నేఁ బని వినియెద'' నని చనుచుండె.

అంత, నాకాంతయు నంతకునిపిఱుందన కొంత దూరము పోయి,

చ. ఎడపక వాఙ్మనఃకృతుల - నేరికి హింస యొనర్పఁ బూన రె
య్యెడలను దీనులం గరుణ- యేర్పడఁ బ్రోవఁగ జూతు రిచ్చుచోఁ
గడుమనసంగనీ కదిరి-కాంక్షితముల్ దుదిముట్టఁ దీర్తు రె
వ్వడు నగుఁ గూర్తు రాశ్రితుల-సజ్జను లిన్నియు నార్య
ధర్మముల్. (భారతము)

ధర్మమూర్తీ! బుధులు త్రికరణముల నేరికి హింసఁ జేయ నొల్లరు. దీనులను గరుణించి రక్షింతురు. ఆశ్రితులకు యథేష్టముగా నీప్సితార్థముల నిత్తురు. నీవు ధర్మదేవతవు. సమస్తభూతములందు సమబుద్ధి గలిగి దానిదానికర్మమునకుఁ

దగినయట్లు ఫలము లేర్పఱుచుటంబట్టి సమవర్తి యను సార్థక నామంబు నీకుఁ గలిగె. అట్టి నిన్ను నే నాశ్రయించితిని. ఆశ్రిత జనులను సుజనులు నిరాకరించుట పాడియా?" యని వేఁడెను.

ఆ వికుషీమణిమృదుమధురభాషణములకు మదిఁ జాల నలరి పితృపతి యతికుతుకంబున "నారీశిరోమణీ! నీ యుదార చతురవాక్యములకు నేను ముదంబు నొందితిని. నీవు పరమ నిష్ఠాగరిష్ఠవు గావున నీయెడ సంతసించితిని. పతిప్రాణదాన వరంబు తప్ప నితరంబు కోరు మిచ్చెద" నని యముఁ డనెను. ఆకోమలి కేలుఁదమ్ములు మొగిడ్చి "పుత్త్రసంతానము లేని నాతండ్రి యగు మద్రభూపతికిఁ బుత్త్రశతంబు నొసంగు" మని యర్థించుటయు, నీకోరినయట్ల కానించితి నని దయారస మొలుక ధర్ముండు పలికి వెండియు ని ట్లనెను:—

"ఓమగువా! నీమగనియాస యుడిగి మగుడుము. నరకలోకమునకు నీబోఁటిపుణ్యవతి రాఁ జనునే?" యనిన, యముని కాబోటి "ధర్మస్వరూపా. నాభర్తతో నుండు లోకము నరకలోక మైనను, నా కదియ యుత్తమలోకము. నా మనోనాయకుఁడు లేనిది నాకలోక మైనను నరకలోక తుల్యం బగుఁ గాదె? నాదువిన్నపం బొక్కటి యాలింపుము. ఇలలో క్షణదర్శనమాత్రంబున సజ్జనులు స్నేహితు లయ్యె దరు. చిరసంభాషణంబున నీకు నేను జుట్టమ నైతి ననుట యతిశయోక్తి కానేరదు. లోకమున బంధుమిత్త్రులకోరిక లీడేర్చుట యవశ్యకర్తవ్యంబు గావునఁ జిత్తగింపు" మను టయు, దయ దయివాఱ శమనుండు నీతికోవిద యగు నా

యువిదతో "సోదరీతుల్యా! నీయెడఁ బ్రసన్నుఁడ నైతిని. నీ వేది కోరిన నిచ్చెదఁ గోరు" మనియెను. స్వాతివానను గాంచిన చాతకమువిధమునను, బెన్నిధిఁ గన్న పేదచందమునను, బ్రవాహమధ్యమున బ్రోవమును గనిన మగ్నునికరణి, నాపన్నిరధిని మునిఁగియున్న యాకాంతాలలామ పరమసంతోషముఁ జెంది యిట్లు ప్రార్థించెను:—

చ. పతివిరహంబు దుస్సహము - భర్తృవినాకృత యైనకాంత దూ
షిత యగు సర్వమంగళవి-శేషములందును గాన మత్ప్రియుం
డతులితకీర్తి శాలి సుగు-ణాఢ్యుఁడు సాళ్వసుతుండు లబ్ధజీ
వితుఁడుగ నిమ్ము ధర్మపద-వీపరిరక్షణ! పుణ్యవీక్షణా!(భారతము)

"దేవా! సతులకుఁ బతివిశ్లేషము దుస్సహము. ప్రాణపదం బగు నాపతికిఁ బ్రాణప్రదము సేయు" మని ప్రార్థించుటయు, నామె ప్రార్థన సంగీకరించి,

చ. కొను మిదె నీ మనఃప్రియునిఁ
గోమలి! వీఁడు చతుశ్శతాబ్దముల్
మను నిటమీఁదఁ బుత్త్రులఁ గ్ర
మంబున నూర్వురఁ గాంచుఁ గీర్తి వ
ర్ధనుఁ డగు సంతతాధ్వరవి
ధానములం బరితుష్టి సేయు న
య్యానిమిషకోటి కల్లను ని
జాన్వయమాలివిభూషణుం డగున్. (భారతము)

ఇదె నీభర్తృజీవంబుల నోసంగితి. వీఁ డీలోకంబున నన్నూఱేండ్లు జీవించి జన్నములు పెక్కు లొనరించి సకల సురుల మెప్పించి వంశవర్ధను లగు పుత్త్రుల నూర్గురం బడయు" నని ప్రసాదించి పరేతరాజు నిజస్థానంబు సేరెను.

అంత నా కాంతయు మరలి వచ్చి ప్రాణేశ్వరుని శరీరము తనతొడలపయి నుంచుకొని కూర్చుండఁగాఁ గొంత వడికి సత్యవంతుఁడు నిద్ర లేచినట్లు లేచి ధర్మపత్నిని జూచి "నన్నెవఁడో బలాఢ్యుఁడు భయంకరుఁడు నగు నొకమహాపురుషుఁడు తిగిచికొని పోయినట్లు కలఁ గంటి" నని మందలించెను. అందుల కాయువతియు ప్రాణనాథుని కాతని యుదంత మంతయు శ్రుతిపఱచి, చీఁకటులు వ్యాపించుటం జేసి యచటు వాసి వేవేగ నా మహాపతివ్రత గృహాభిముఖముగా సత్యవంతునితోఁ జనుదెంచుచుండెను.

ఇట ద్యుమత్సేనుఁడు దృష్టిసంపన్నుఁడై నందున నొక్కప్రక్క మోదమును, గొడుకును గోడలు నింక నిలు సేరమికి మఱొకవంక ఖేదమును నొందుచు, వారినిగూర్చి చుట్టుపట్టులఁ గల జడదారుల నడుగుచుండెను. ఉత్తరక్షణముననే, సావిత్రీ చిత్రాశ్వుల శుభాగమనమును గని, యానంద మొంది, సాల్వేంద్రుఁడు వారియాలస్యమునకుఁ గతం బడుగుటయు, సావిత్రి యడవిలో నడచినవృత్తాంతము నత్తమామలకుఁ దెలుపఁబూని పూర్వము నారదమహాముని యానతిచ్చిన వివరణమును, నిజవ్రతాచరణకారణమును, నాఁడు పెనిమిటిని వెంట నంటిన కారణమును, నడవిలో నాతనికి స్మారకము తప్పుటయు. నతనిమరణమును, యమదర్శనమును, దదనుగమనమును, వరపరంపరాప్రదానమును, బతిపునర్జీవితవృత్తాంతమును ససాకల్యముగ శ్రుతపఱిచెను.

ఆమెమామ యగు ద్యుమత్సేనుఁ డమందానందనిమగ్నుఁ డై

క. "ఆపత్సముద్రమగ్నం
బై పోయెడు నస్మదన్వ-యము పెం పెసఁగం
దీప యయి కడవఁ బెట్టిన
నీపుణ్యచరిత్ర గీర్తి-నీయుము తల్లీ!" (భారతము)

యని కోడలిని గొనియాడెను. మునిజనులు నానాధ్వమణిపాతి వ్రత్యప్రభావమునకు నాసాన్య స్తతిర్జను లగుచు, నామెను బహువిధంబులఁ బ్రశంసించిరి. పిదప నా పుణ్యదంపతులు సావిత్రీసత్యవంతులు వారికందఱకు భక్తితోఁ బ్రణామిల్లుటయు మునిశ్వేనులు వారి నాశీర్వదించి నిజనివాసములకుం బోయిరి.

తదనంతరము సాళ్వదేశమునుండి ద్యుమత్సేనుని యా ప్తు లగు పురోహితామాత్యభృత్యవర్గంబు వచ్చి "మహాప్రభూ. మనశత్రువులు నశించిరి. ఇఁక మీరాజ్యము నెప్పటి చొప్పునఁ బాలింప రం" డని ప్రార్థించెను. సాళ్వపతియుఁ గుటుంబసమేతముగఁ దరలి, మునుల వీడుకొని, రథంబు నధిరోహించి చతురంగసైన్యములతో రాచఠీవి యొప్పఁ బైనమై, సర్వాలంకృతశోభితం బగు మంగళతూర్యారావంబులు మిన్నుముట్ట రాజిలురాజధానిం బ్రవేశించి, ప్రజలస్వాగతంబుఁ బడసి వారల కభయం బిచ్చి, పూర్వప్రకారంబునఁ బరమసుఖంబుతో రాజ్యపరిపాలనంబు సేయుచుండెను.

అనతికాలంబున కావృద్ధరాజు తనయునకుం బట్టంబు గట్టి తపంబు సేయం బోయెను. అంతట సత్యవంతమహారాజు సకలైశ్వర్యములతో నలరారుచు ననేకయాగంబు లొనర్చి,

సావిత్రీదేవియందును గుణశీల సూర్యాంశ గాంచి, సౌఖ్యముతో నుర్వర నేలుచుండెను.

సుచరితా! సాధ్వీమణి యగు సావిత్రీదేవి పుట్టినింటి కిని మెట్టినయింటికిని శ్రేయములను గూర్చెను. పాతివ్రత్య మను సత్కీర్తిని సంపాదించెను! ఇట్టివారు గదా స్త్రీలు విద్యావతులై వివేకవతులై లోకమునకు శుభములు లాపాదింపవలయును?

ఓమ్ తత్సత్, శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.



శ్రీ

# త ప తి



యమునాతీరమునం దష్టసంపదల నింపి హస్తినాపుర మను పట్టణ ముండెను. ఆపట్టణమును భరతవంశస్థుఁడగు యజామీఢుని కుమారుఁడు సంవరణుఁడనువాఁడు పాలించు చుండెను. అతఁ డొకనాఁడు వేఁటతమకమున నడవి యంతయుఁ దిరిగి, నూఁకలిదప్పికలచే డీలుపడి నేలఁ బడిన తనగుఱ్ఱము నచ్చోటనె విడిచి, యొంటరియై నడచిపోవుచు నొకపర్వతవనప్రదేశమును బ్రవేశించెను.

అం దొక్కచోటఁ బరమలావణ్యవతి యొక్కతె విలాసముగా విహరించుచుండెను. అప్పు డాకనకాంగిదేహకాంతి యావన మంతయు నావరించుటచే, నందలివృక్షలతాదులు బంగారురంగుతోఁ గూడి రంగు మీఱి యుండెను.

అట్టి సుందరదృశ్యమును సంవరణుఁడు పొడగాంచి, తటకాపడి నిలిచి, కొంతసేపటికిఁ దెలిసి, యాశ్చర్యమగ్న మానసుఁడై యిట్లు తలపోసెను:

సీ॥ "త్రిభువనలక్ష్మి గన్ - నెంచి నీకాంత మి
        క్లిలోకో యున్నది - యిప్పావనమున
    గగనమణిప్రభ - గగనంబునందుండి
        యవనీతలప్రాప్త - యయ్యెనొక్కొ
    శంభుండు లావణ్య-సద్గుణసముదాయ
        మింద యిమ్ముగ సంగ్ర-హించెనొక్కొ

దీనియంగమునఁ బొం-దిన యవ్విభూషణ
శ్రీ నోమి పుణ్యంబుఁ - జేసెనొక్కొ

ఆ. యమరకన్యయొక్కొ - యక్షకన్యకయొక్కొ
సిద్ధకన్యయొక్కొ - శ్రీసమృద్ధి
సర్వలక్షణప్ర-శస్తాంగి యిది దివ్య
కన్య యగు ననంత-కాంతి పేర్మి. (భారతము)

అని నిశ్చయించి, యాతరుణిని సమీపించి యిట్లనియె:

ఆ. ఎఱుఁగఁ జెప్పు మబల! - యెవ్వరిదాన వి
ట్లేల యున్నదాన - వేకతంబ
క్రూరవనమృగములు - గ్రుమ్మరుచున్న యీ
విజనవిషమశైల-విపినభూమి?'' (భారతము)

అని ప్రశ్నించుచుండఁగనే, యావనిత ప్రత్యుత్తర మీక, మెఱపుఁదీఁగయట్లు కానఁబడక పోయెను. ఆకన్య కానమి మానవనాథుఁడు మహీతలముపైఁ బడి మిగుల వగచుచుండె. మఱికొంతసేపటికి కాలేమ యతనికట్టెదుటఁ బొడకట్టి, "రాజోత్తమా! నేల యీలీల మోహమునఁ దగులువడితి" వని యడిగెను. అందులకు సంవరణుఁడు "సరసీరుహాక్షీ! ధరణియం దవక్రపరాక్రమభుజబలదర్పముచే నేనె యధికుఁడనై యెవ్వరికిని భయపడక యుంటిని. కాని యిప్పుడు నీరూపలావణ్యములను గాంచి, నీయెడఁబాటువలని భయమునకు లోనైతి. కావున నీవు గాంధర్వవివాహవిధిచే

నన్ను వరియింపు'' మని వేఁడిన, సంవరణునకుఁ దపతి యి ట్లనియె;

''అవనీతలేశ్వరా! భువనైకదీపకుఁ డగు సూర్యదేవు నకుఁ గూఁతురను. సావిత్రీదేవికిఁ జెలియలను. తపతి యను దేవకన్యను. నాయందు నీకుఁ బ్రియము గలదేని నాతండ్రి నడుగుము. అతండు నన్ను నీ కొసఁగును. స్త్రీలకు స్వాతంత్ర్యము లేమి నీ వెఱుంగనిది కాదు. కనుక నీ వెడతెగని జపనియమాదులచేత నాజనకు నుపాసింపుము. అతఁడు నీయెడఁ బ్రసన్నుఁ డగు'' నని పలికి యాకాంత యంతర్హిత యయ్యెను. ఆమెయెడఁబాటునకు సహింపక వెంటనె భూకాంతుఁడు భూమిపై మూర్ఛిల్లెను.

అంతట, నారాజేంద్రుని వెదకికొనుచు నయ్యెడకు నాతనిమంత్రి వచ్చి చూచి, యాతనిమోముపై శీతలజలములు చల్లెను. తోడుతనె, మహీపతి మూర్ఛ దేఱి, మంత్రిని రాజ్యము రక్షింపఁ బంపి, తా నా పర్వతముననె నిలిచి, సూర్యదేవు నతిభక్తితోడ నారాధించు చుండెను.

క. ఆయిందువంశతిలకుఁడు
గాయత్రీమంత్రజపవికస్వరమతితోఁ
బాయక యారవిమూర్తికి
నాయతమతిఁ జేసె నంతరంగపుఁబూజల్.

సీ. ఆవాహన మొనర్చె నరుణున కాసనం
బిచ్చె హేళికిఁ బాద్య మిడియె రవికిఁ

దరణి కర్ఘ్యము లిచ్చెఁ దపనున కొసఁగె నా
చమనీయ మాదిత్యు జలక మార్చెఁ
బటవంతుఁ జేసె సుక్ష్మతి సర్ప్య నుపవీతుఁ
గావించె ద్యుమణికి గంధ మలఁదెఁ
బూషు నక్షతములఁ బుష్పాలఁ బూజించెఁ
బద్మమిత్రునకు ధూపము ఘటించె
తే. దీప మొసఁగించె మందేహతాపనునకుఁ
గలితనైవేద్య మర్పించె గగనమణికి
నమరఁ గల్పించెఁ దాంబూల మర్ఘ్యమునకు
నల్లునిగఁ గూర్చు మని వేఁడె నబ్జసఖుని.

(తపతీసంవరణోపాఖ్యానము)

అట్లు పరమనిష్ఠతో భాస్కరు నుపాసించుచు, నొక్క నాఁడు సంవరణుఁడు తనపురోహితుని వసిష్ఠమహర్షిని స్మరించెను. అప్పు డమ్మహామునియు నచ్చటి కరుదెంచి, నిరత వ్రతోపవాసములచే శుష్కించినశరీరముతో నున్నసంవరణునిఁ గాంచి, యతఁడు సూర్యపుత్రి యగుతపతియందు బద్ధానురాగుఁ డగుటను యోగదృష్టిచే గ్రహించి, యతని మనోభీష్టమును దీర్పఁ బూని, తనయోగబలమున నభోమండలమునకుఁ జని సహస్రకిరణుని గని, యసంఖ్యాక మగు వేదమంత్రములచే నతని సంస్తుతించెను. అప్పుడు దిననాథుఁడు మునినాథుని మిక్కిలి గారవించి, యతఁడు వచ్చిన కార్యము నతనివలన నెఱింగి, సంవరణుఁడే తనతనయకుఁ

దగినవాఁడని తనసమ్మతి దెలిపి, తపతిని గ్రహింపుము సంవరణు బుజ్జగించి, తపోనిధివెంటఁ బంపెను.

అట్లు తపనునిచే నొసంగఁబడినతపతిని దోడ్కొని వచ్చి మహాత్ముఁ డగువసిష్ఠమునివరుండు సంవరణునకుఁ బరిణయముఁ జేయించెను. ఆనూతనదంపతు లాపర్వతముననె కొంతకాలము సుఖముండిరి. వారికి వంశకరుఁ డై కురుఁ డనుపుణ్యమూర్తి యుద్భవించి జగద్విఖ్యాతి గాంచెను.

మంగళ మస్తు.

## పోషకులు.

శ్రీయుత క. తిరువేంగడంనాయఁడుగారు (మెస్సర్సు బిన్నీ షిప్ డుబాష్ ఆఫీస్ మద్రాస్)

శ్రీయుత సజ్జా మునిస్వామిసెట్టిగారు, (మునిసిపలు కమిషనరు, ప్రాఁత చాకలపేఁట, మద్రాస్.)

## సహాయులు.

శ్రీమాన్ చదరంగిపట్టణము శ్రీనివాసయ్యగారు, సుఖజీవనము, జార్జిటౌన్, మద్రాస్)

,, క. తిరువేంగడయ్య గారు (నేటివ్ డాక్టర్, తిరువట్టియూరు హైరోడ్, ప్రాఁతచాకలపేఁట, మద్రాస్)

,, ఒరయూరు నారాయణయ్యగారు, సుఖజీవనము, ప్రాఁతచాకలపేఁట, మద్రాస్)

,, నిశ్చింత శ్రీనివాసయ్యగారు, సుఖజీవనము, ప్రాఁతచాకలపేఁట, మద్రాస్)

,, నిశ్చింత వేంకటనరసింహయ్యగారు, లేట్ హెడ్ క్లార్క్, మెస్సర్స్ విల్సన్ అండ్ కంపెనీ, మద్రాస్)

,, నిశ్చింతగోవిందయ్యగారు, క్లియరింగ్ ఏజెంటు, కస్టమ్ హౌస్. మద్రాస్)

,, తిరునిర్మల దేశికులయ్యగారు, కాన్వాసింగ్ ఏజెంటు, మెస్సర్స్. ఏ. మర్కాట్ అన్డ్ కంపెనీ, లిమిటెడ్., మద్రాస్.)

,, తిరునగరి రాజయ్య గారు, హెడ్ రికార్డు-కీపర్, ఇంపీరియల్ బ్యాంక్, మద్రాస్)

,, క. లక్ష్మీనారాయణగారు, సింప్సన్ మెకానిక్ అండ్ కంపెనీ, మద్రాస్)

,, టి. ఎన్. బాబు గారు, మిలిటరీ అకౌంటెంట్ డిపార్టుమెంటు, మద్రాసు)